
Ramanand Sagar's
Ramayan
PHOTO COMICS
12 volumes. In Hindi and English
Rs. 5/- each
Published by
CHANDAMAMA
VIJAYA COMBINES
188, N.S.K. Salai, Vadapalani, Madras-600 026.
Under licence from
SAGAR ENTERPRISES
Natraj Studios, 194, Andheri Kurla Road, Bombay-400 069.
Ramanand Sagar's
Ramayan
Legend has it that a herb gave new life to man.
ZANDU

# చందమామ

అక్టోబర్ 1989

★

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



★


విడి ప్రతి: 3-00

సంవత్సర చందా: 36-00




Now from Lion Pencils, here's another Novelty...
the Pearl finished **LION PINKY** pencil, a pretty pencil to behold.
Superb in looks, super smooth in writing with its HB Lead
strongly bonded to give you unbreakable points.

***Also available with rubber tip and hexagonal***

***Other popular brands of Lion Pencils are:***

Lion **MOTO**, Lion **TURBO**, Lion **SWEETY**, Lion **CONCORD**,
Lion Hi-Tech **METALLIC**, Lion **MASH-HOOR**, Lion **EXECUTIVE**,
Lion **NOVELTY**, Lion **GEEMATIC** Drawing Pencils
and **RATTAN** Colour Pencils & Wax Crayons.

**LION PENCILS PVT. LTD.** 95 Parijat, Marine Drive, Bombay 400 002.

National-407

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## ఉన్నత శిఖరాలపై శాంతి వర్ధిల్లాలి!

భారత్ - పాకిస్థాన్ సరిహద్దు ప్రాంతంలోని సియాచన్ పర్వత ప్రాంతం ఈనాడు వార్తలలో ప్రముఖస్థానం వహిస్తూ, అందరి దృష్టినీ ఆకర్షిస్తున్నది. ఇండియా-పాకిస్థాన్‌ల మధ్య దురదృష్టవశాత్తు మళ్ళీ ఘర్షణ చెలరేగినట్టయితే, 6,300 మీటర్ల ఎత్తయిన సియాచన్, ప్రపంచంలోకెల్లా ఎత్తయిన యుద్ధరంగంగా మారే అపాయం ఉన్నది. ఇటీవల ఈ ప్రాంతానికి వెళ్ళివచ్చిన ఒక మిత్రుడిలా అన్నాడు: "ఇండియా, పాకిస్థాన్ దేశాలు స్నేహంతో, సుహృద్భావంతో ఉన్నప్పుడే, ఈ ప్రాంతంలోని ఉభయదేశాల సైనికులు అనుక్షణం, ఒకరిని చూసి మరొకరు భయపడుతూ రేయింబవళ్ళు గడిపే దుస్థితి తొలగుతుంది."

ఇది ఆయన అభిప్రాయం మాత్రమే. నిజానికి, మన సైనికులు ఎంతో అప్రమత్తతతో, ధైర్యంతో ఈ సరిహద్దు ప్రాంతాన్ని పరిరక్షిస్తున్నారు!

ఈ ప్రశాంత ప్రాంతంలో శాంతిని పరిరక్షించడానికి ఇండియా, పాకిస్థాన్‌ల మధ్య త్వరలో చర్చలు ప్రారంభంకానున్నవి. ఈ చర్చలు విజయవంతం కావాలని ఆశిద్దాం. మనిషిలోని ఔన్నత్యానికి ప్రతీకలుగా ఈ మహోన్నత కొండశిఖరాలు వర్ధిల్లాలి!

[ఈ నెల బేతాళకథ (శూరసేనుడి కథ)కు ఆధారం లక్ష్మీగాయత్రి రచన.]

సంపుటి 85 అక్టోబర్ '89 సంచిక 4

విడి ప్రతి: 3-00 : : సంవత్సర చందా: 36-00

# మీకు ఎలాంటి వారపత్రిక కావాలి?

సదభిరుచులకు, సత్సంప్రదాయాలకూ ప్రతీకగా, తెలుగువారి హృదయాల్లో ప్రత్యేక స్థానాన్ని చూరగొన్న కుటుంబ పత్రికలు

**చందమామ**
**విజయచిత్ర**
**వనిత**

వెలువరిస్తున్న ప్రచురణకర్తలనుంచి
త్వరలో రానున్నది ఓ విశేష వారపత్రిక

? ? ? ? ? ?

యువశక్తిలో నవచైతన్యాన్ని రగిలించడమే ధ్యేయంగా
ప్రారంభం కానున్న ఈ పత్రికకు

## మీరేం పేరు పెడతారు?
## మీకు ఎలాంటి శీర్షికలు కావాలి?
## కథలు, సీరియల్స్ ఎటువంటివి ఆశిస్తున్నారు?
## రాజకీయరంగంలోని పరిణామాలు, పరిశోధనాత్మక వ్యాసాలు ఏవిధంగా వుండాలి?
## సంగీతం, క్రీడలు, సినిమా వంటి శీర్షికలు ఎలా వుండాలనుకుంటున్నారు?

పైన పేర్కొన్న అంశాలేకాక, అభిరుచిగల పాఠకులుగా ఈ నవయువతరం వారపత్రిక ఏవిధంగా రూపొందాలనుకుంటున్నారో — వివరంగా రెండు అరఠావు పేజీలలో మీ అభిప్రాయాలని నవంబర్ 5వ తేదీలోగా పంపించండి.

**ఉత్తమమైన అభిప్రాయాలు, మంచిపేరు సూచించిన పదిమందికి**
**సంక్రాంతి కానుకగా పసందైన బహుమతులు!**

పాఠకుల అభిరుచులకు అనుగుణంగా పత్రికను తీర్చిదిద్దడమే మా ఆశయం. అందుకు సహకరించ వలసిందిగా అందరికీ విజ్ఞప్తి చేస్తున్నాము.

మీ సూచనలు పంపవలసిన చిరునామా:

ప్రచురణకర్త
కొత్త వారపత్రిక
చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

## వార్తలు-విశేషాలు :



# జాబ్ చార్నాక్ గుర్తున్నాడా?

ఈనాడు కలకత్తా, ప్రపంచంలోని మహా నగరాలలో ఒకటి. అయితే, మూడువందల సంవత్సరాలకిందట ప్రస్తుతం ఈ నగరం ఉంటూన్న స్థానంలో కనుచూపుమేరకు వరి పొలాలూ, పచ్చికమైదానాలూ, ఇసుకపర్రలూ- వీటిమధ్య అక్కడక్కడ కొన్ని గ్రామాలు మాత్రమే ఉండేవి! మూడువందల సంవత్సరాలలో ఇంత పెద్ద మార్పు ఎలా వచ్చింది?

1690 వ సంవత్సరం జాబ్ చార్నాక్ అనే ఆంగ్లేయ యువకుడు హుగ్లీనదీతీరానికి వచ్చాడు. ఈస్టిండియా కంపెనీ గురించి మన కందరికీ తెలుసు. బ్రిటిష్‌వాళ్ళు ఏర్పాటు చేసుకున్న ఒక వ్యాపారసంస్థ అది. వ్యాపారాని కని భారతదేశంలో అడుగుపెట్టిన ఈస్టిండియా కంపెనీ, తన రాజకీయతంత్రంతో, కుతంత్రాల ద్వారా, యుద్ధాలద్వారా, బెదిరింపులతో, మోసాలతో మన దేశంలోని అనేక రాజ్యాలను క్రమక్రమంగా వశపరచుకున్నది. ఈస్టిండియా కంపెనీ యే జాబ్ చార్నాక్‌ను హుగ్లీనదీతీరానికి పంపింది.

1690 వ సంవత్సరం ఆగస్టు 24 వ తేదీన జాబ్ చార్నాక్ కలకత్తానగరానికి శంకుస్థాపన చేశాడు!

కలకత్తానగరం ఏర్పడి మూడువందల సంవత్సరాలు పూర్తి చేసుకుంటూన్న సందర్భాన్ని పురస్కరించుకుని, ఈ ఆగస్టు 24 తేదీన నగర ప్రముఖులు, స్థానిక సెయింట్ జార్జ్‌చర్చ్ ప్రాంగణంలోని జాబ్ చార్నాక్ సమాధి వద్ద ఒక సమావేశం ఏర్పాటు చేశారు. నగర సౌభాగ్యాన్ని ప్రస్తుతించే ప్రార్థనా గీతంతో సభ ప్రారంభమయింది. ఆ తరవాత జాబ్ చార్నాక్ సమాధికి ఇరువైపులా మొక్కలు



నాటారు. తరవాత సభలో ఉపన్యసించిన వక్తలు—కలకత్తానగరంలో జన్మించిన మహనీయులను గురించీ, ఈ నగరం కేంద్రంగా తమ కార్యకలాపాలను సాగించిన జాతీయ నాయకులను గురించీ విపులంగా తెలియజేశారు.

## దీర్ఘాయువు రహస్యం?

ఆగస్టు 23 వ తారీఖున గ్రేట్ బ్రిటన్‌లోని ఒక గ్రామంలోని వృద్ధుడు తన 112 వ: జన్మదినోత్సవాన్ని హడావుడి లేకుండా ఎంతో హుందాగా జరుపుకున్నాడు. ప్రపంచంలోకెల్లా అతడే వృద్ధుడని పత్రికలు ప్రశంసించాయి. ఆయన వయసు వాళ్ళూ, అతనికన్నా వృద్ధులూ మరెక్కడయినా ఉండవచ్చు. అయితే, వాళ్ళను గురించి మనకు తెలియదు.

అరవైయేళ్ళు గనిలో పని చేసిన ఈ 112 సంవత్సరాల వృద్ధుడి పేరు జాన్ ఇవాన్స్!

"మీ దీర్ఘాయువు రహస్యం ఏమిటి?" అని ఆయన అభిమానులు ఆయన్ని అడిగారు.

"మద్యపానం చేయను, పొగాకు కాల్చను. ఎప్పుడుగాని ఎవర్నీ కోప్పడను. జూదం జోలికి పోను," అని చెప్పాడా వృద్ధుడు.

ఆయనకు సన్నిహితంగా ఉన్నవారు ఆయన మద్యపానం చేయడంగాని, పొగపీల్చడంగాని, ఎదుటివారిపై మండిపడడంగాని, తామెప్పుడూ చూడలేదన్నారు. అందువల్ల ఆయన తాను చెప్పినట్టు తూచా • తప్పకుండా నడుచుకుంటున్నాడన్న మాట. ఇవే ప్రపంచ వృద్ధుడి దీర్ఘాయువు రహస్యాలు!

## ఎనిమిదిటన్నుల గ్రంథం!

నాలుగు మీటర్ల పొడవూ, మూడు మీటర్ల వెడల్పూ, ఎనిమిది టన్నుల బరువూ గల—ప్రపంచంలోకెల్లా బరువైన పుస్తకాన్ని ఇటీవల ఫ్రాన్స్‌లోని టూలౌస్ నగరంలో ప్రదర్శనకు ఉంచారు.

ఒక స్థానిక ప్రచురణా సంస్థ 150 వ వార్షికోత్సవం సందర్భంగా ఈ పెద్ద పుస్తకాన్ని ప్రచురించారు. పరిశ్రమలు, వర్తకం, కళలు, ప్రచురణ మొదలైన రంగాలకు చెందిన ప్రముఖుల వివరాలకు ఈ పుస్తకంలో ముప్పై పేజీలు కేటాయించారు. వీటిలో ఒక్కొక్క పుట బరువు 200 కిలో గ్రాములు!





# గంటల భూతం

గిరిపురం అనే గ్రామంలో, చెన్నకేశవయ్య అనే గాజులవ్యాపారి వుండేవాడు. అతడికి ఒక గాజులబండి వుండేది. ఆ బండికి గాజులన్నీ అలంకరించి, దాన్ని తోసుకుని వెళుతూ, "గాజులమ్మా, గాజులు!" అని కేకపెట్టి, బండికి కట్టివున్న గంటను మోగించేవాడు. ఆ గంట మోత వినడానికి ఎంతో ఇంపుగా వుండేది.

ఒక రోజున చెన్నకేశవయ్య బేరం బాగా వుండడంతో, చాలా దూరం తిరిగి చీకటిపడేవేళకు ఇంటిముఖం పట్టాడు. వచ్చే దారిపక్కన ఒక పెద్ద చింతచెట్టు ఉన్నది. ఆ చెట్టు మీదికి ఆ రోజే, ఒక భూతం వచ్చి చేరింది. అది ఒట్టి అల్లరి భూతం. ఎవరిని అల్లరిపెట్టి ఏడిపించాలా అని అది ఆలోచిస్తూండగా, గంట మోగిస్తూ గాజులబండితో, చెన్నకేశవయ్య కనిపించాడు.

భూతం ఆనాటివరకూ గంటను చూసి వుండలేదు. గంట ఆకారం, దానిలో నుంచి వస్తున్న ధ్వనీ దానికి చాలా బావున్నదనిపించింది.

అది గాలిలో తేలుతూపోయి, గంట లాక్కుని మాయమైపోయింది. భూతాన్ని చూసిన చెన్నకేశవయ్య భయకంపితుడై, పరుగు పరుగున పోయి, రచ్చబండ దగ్గిర చేరి కబుర్లు చెప్పుకుంటున్నవారికి, భూతం తన గంటను లాక్కుపోయినట్టు చెప్పాడు.

అయితే, అది విన్నవాళ్ళెవరూ, చెన్నకేశవయ్య మాటలు నమ్మలేదు. ఎవడో కొంటెకుర్రవాడు, ఆ పని చేసివుంటాడనీ, అసలుభూతం అనేదాన్ని తామింతవరకూ చూడలేదనీ నవ్వేశారు.

ఆ మర్నాటి నుంచీ, వరసగా పీచు మిఠాయి అమ్మే చలమయ్య బండిగంటా,

ఎస్. శివనాగేశ్వరరావు



గంటల మోతలో హాయిగా వినోదిస్తూ, పగలు చింతచెట్టు మీద సుఖంగా నిద్ర పోతున్నది.

జనానికి, గంటలభూతంపీడవదిలించు కోవడం ఎలాగో అర్థం కాలేదు. భూత వైద్యుడు మరిడయ్య, గంటలభూతాన్ని పరగణా సరిహద్దుల అవతలికి పారి పోయేలా చేస్తానని, అందరిముందూ ప్రగల్భాలు పలికాడు. వాడు ఒకనాటి సాయంత్రం చీకటి పడుతున్న సమ యంలో, నిమ్మకాయలూ, వేపమండలూ తీసుకుపోయి, నిమ్మకాయలు కోసి గాలిలో ఎగరేస్తూ, వేపమండలు ఝుళిపిస్తూ మంత్రాలు చదివాడు. వాడి మంత్రాలకు భూతమైతే వచ్చింది కాని, అది వాడి మెడలోని చిన్న వెండిగంటను లాక్కు పోయింది.

ఇది చూసి మరిడయ్య లబోదిబో మన్నాడు. ఇలాంటి చిలిపిభూతాన్ని తానే కాదు, తన గురువు గౌడన్న కూడా చూడ లేదన్నాడు. తన మంత్రాలు హానిచేసే పొగరుబోతు భూతాల మీద పని చేస్తవి గాని, ఇలాంటి చిల్లరమల్లర చిలిపి భూతాల మీద పని చేయవని చెప్పి, ఇంటి దారిపట్టాడు.

ఇలాంటి సమయంలో, పట్టణంలో చదువుకుంటున్న వసంతుడనే యువ

పిల్లలకు పాఠాలు చెప్పే పరంధామయ్య వసారాలోని గంటా—యిలా చాలా ఇళ్ళలోని గంటలు మాయమయాయి.

ఊరివాళ్ళు చెన్నకేశవయ్య చెప్పింది నిజమేనేమో అన్న అనుమానంలో వుండగా, కొద్ది రోజుల్లోనే అది కాస్తా నిజమని తేలిపోయింది. అదెలా జరిగిం దంటే, భూతం తాను దొంగిలించిన గంట లన్నీ మెడలో వేసుకుని, రాత్రిపూట ఊరి మధ్య గాలిలో తేలుతూ ఉత్సాహంగా పల్లటీలు కొట్టసాగింది. అప్పుడు వచ్చే గంటమోత ఎంత విన్నా, దానికి తనివి తీరడం లేదు. ఇందువల్ల ఊరి జనానికి నిద్ర కరువైంది. భూతం మాత్రం రాత్రిళ్ళు

కుడు. ఆ ఊరిలోని చుట్టాల ఇంటికి వచ్చాడు. అతడికి గంటలభూతం, ఊరి జనానికి నిద్ర లేకుండా చేయడం గురించి తెలిసింది. వసంతుడు ధైర్య వంతుడేకాక, చాలా తెలివిగలవాడు. తన తెలివితేటలతో ఏదో ఒక యుక్తిపన్ని, గంటలభూతాన్ని ఊరి నుంచి తరిమేయా లనుకున్నాడు.

ఒకనాటి రాత్రి వసంతుడు, ఒక పెద్ద గంట పట్టుకుని వీధులలో తిరగసాగాడు. అతడు ఊహించినట్టే నడిరేయి కావస్తున్నప్పుడు గంటలభూతం మెల్లగా గాలిలో తేలుతూ, అతడి ముందుకు వచ్చి దిగింది. వసంతుడు దాన్ని చూసి ఏమాత్రం భయపడకుండా నిలబడ్డాడు.

అప్పుడు భూతం తన పెద్ద కళ్ళను చక్రాల్లా తిప్పుతూ, నోరుతెరిచి బయటికి మంటలు ఊదసాగింది.

వసంతుడు చిన్నగా నవ్వి, "మంటల్ని మరికొంతసేపు అలాగే తెప్పించు. ఇది చలికాలం గదా! కానీ ఖర్చులేకుండా చలికాగవచ్చు," అన్నాడు.

ఆ మాటలకు గంటలభూతం విస్తుపోయి, నోటినుంచి మంటలు తెప్పించడం ఆపి, "మిగతా ఊరివాళ్ళలా, నన్ను చూస్తూనే గంట అక్కడ పారేసి పారిపోతావనుకున్నాను. సరే! నీ ధైర్యానికి మెచ్చాను. నీ చేతిలోని గంట చాలా బావున్నది. అది యిచ్చి, ఇంటికి పో," అన్నది.



అందుకు వసంతుడు, "అలా యిచ్చినందువల్ల ఏం ప్రయోజనం వుండదు. గంటను మోగించడం, నీవల్ల కాదు," అన్నాడు.

"గంట మోగించడం, నావల్ల కాదా? నా మెడలో ఎన్ని గంటలున్నవో చూడు. వీటన్నిటినీ, నీ చెవులు దిబ్బళ్ళెత్తేలా మోగించగలను," అంటూ భూతం గంటలను మోగించింది.

అది చూసి వసంతుడు, "ఈ గంటను నీకిస్తాను. అయితే అందుకొక పందెం వున్నది. ఈ గంటను నువ్వు మోగించలేకపోతే, ఆ మరుక్షణమే నీవీ ఊరు వదిలిపోవాలి. ఇందుకు నీకు యిష్టమేనా?" అని అడిగాడు.

"ఇష్టమే! ఇదీ ఒక పెద్ద పందేమేనా," అంటూ భూతం చేయిచాచింది.

వసంతుడు, దానికి గంట నిచ్చాడు. భూతం దాన్ని మోగించాలని అటూ యిటూ ఊపి చూసింది. కాని గంట మోగలేదు.

అప్పుడు భూతం గంటలోపలికి చూసి, "మోసం! దీనికి కాడలేదు, ఎలా మోగుతుంది. పోనీ నువ్వు మోగించి చూపించు. పందెం ప్రకారం, యీ ఊరు వదిలిపోతాను," అన్నది.

వసంతుడు గంట అందుకుని, దాన్ని ఊపాడు. గంట గణగణమంటూ పెద్దగా మోగింది.

అది విని భూతం బిక్కముఖం పెట్టి, "చూడబోతే నువ్వు గొప్ప మంత్రగాడిలా వున్నావు. పందెంలో నువ్వే గెలిచావు. అన్నమాట ప్రకారం యిప్పుడే, ఈ ఊరు వదిలిపోతున్నాను," అంటూ గాలిలోకి లేచి ఊరొదిలి ఎక్కడికో పారిపోయింది.

వసంతుడు చిన్నగా నవ్వుకుంటూ, బయటికి కనిపించకుండా చొక్కా కింద ముంజేతికి కట్టుకున్న చిన్న గంటను ఊడదీశాడు. చేయి కదిలించినప్పుడు, భూతానికి వినిపించింది, ఆ గంట చప్పుడే! అయినా, భూతం ఆ సంగతి గ్రహించలేకపోయింది.






## 2

[సుమేధరాజ్య రాజధాని శాంతిపురం సుసంపన్ననగరం. రాజు శాంతిదేవుడు శాంతిప్రియుడు. రాజబంధువయిన సేనాధిపతి వీరసింహుడు, ప్రజలందరూ ఉత్సవవేడుకలలో నిమగ్నులై ఉన్నప్పుడు రాజకుటుంబాన్ని హతమార్చాలని కుట్రపన్నాడు. విషయం తెలిసిన రాజు, తన రెండేళ్ళ కుమారుణ్ణీ, రాణినీ రహస్య సొరంగ మార్గంగుండా పంపి వేశాడు. తరవాత—]

"తలుపు తెరువు!'' అని కఠిన స్వరంతో కేకలు వినిపించాయి. రాజు శాంతిదేవుడు కొంతసేపు మౌనం వహించాడు. మళ్ళీ తలుపును దబదబా బాదుతూ, ''తలుపు తెరువు!'' అని అరవడం రాజుకు వినిపించింది. ఆయన కిటికీలోని రహస్య ద్వారం గుండా చూశాడు. వెలుపల ముఖ పరిచయం లేని పదిమంది భటులు రాజుకు కనిపించారు. బహుశా, వీరసింహుడు వాళ్ళను పొరుగురాజ్యం నుంచి రప్పించి ఉంటాడు. వాళ్ళు భీకరంగా చిందులు వేస్తున్నారు.

ఎంత అరిచినా తలుపు తెరవకపోయేసరికి భటుల ఓర్పు నశించింది. తలుపును బద్దలు కొట్టాలని, వాళ్ళు పెద్ద దూలాన్ని తలుపుకు ఢీకొట్టించడానికి పూనుకున్నారు. ఆ దూలం తాకిడిని తలుపు తట్టుకోజాలదని రాజు గ్రహించాడు. భటులు దూలాన్ని



భుజాలపై మోసుకువచ్చి, దానితో బలంగా తలుపును ఢీకొట్టించాలని, పదడుగులు వెనక్కు వేసి వేగంగా ముందుకు ఉరికే సమయం చూసి రాజు చటుక్కున తలుపు తెరిచాడు. అంతే, దూలంతోపాటు భటులు ముందుకు పడిపోయారు. మరుక్షణమే రాజు కత్తిదూసి, మెరుపులా ముందుకు దూకాడు. భటులు పరిస్థితి గ్రహించేలోగా వాళ్ళలో ఇద్దరి తలలు ఎగిరిపోయాయి.

"తప్పించుకున్నాడు, తప్పించుకున్నాడు!" అని అరిచారు మిగిలిన వాళ్ళు.

"పట్టుకోండి. ఎలాగైనా వాణ్ణి చంపండి. వదిలారంటే మీ తలలు ఎగిరిపోతాయి. జాగ్రత్త!" అని దూరం నుంచి ఒక భీకర కంఠస్వరం ఆజ్ఞాపించింది. అది సేనాధిపతి వీరసింహుడి కంఠస్వరం అని రాజు గ్రహించాడు.

రాజప్రాసాదానికి వెలుపల బాణాసంచా వేడుకలు బ్రహ్మాండంగా జరుగుతున్నవి. ఆకాశాన్నంటే కృత్రిమ వృక్షాకారంతో రకరకాల బాణాసంచాలు వింత వింత రంగులతో, చెవులు తూట్లుపడే శబ్దంతో పేలుతున్నవి. రాజభవనం లోపల జరుగుతూన్న పోరాటం గురించి అక్కడివాళ్ళలో ఏ ఒక్కరికీ తెలియదు!

రాణిగారి భవనం నిండా ఎన్నో గదులూ, మంటపాలూ ఉన్నాయి. కాని వాటి ద్వారాలన్నీ మూసి ఉన్నాయి. ఒక వేళ రాజూ, రాణీ తప్పించుకుని అడుగు బయటపెడితే, వాళ్ళను హతమార్చడానికి సిద్ధంగా, ఒక్కొక్క ద్వారం దగ్గరా, వీరసింహుడి భటులు కత్తులు దూసి కాపలా కాస్తున్నారు!

ఎదురుగా ఉన్న మెట్లకేసి రాజు వేగంగా పరిగెత్తాడు. అక్కడ కాపలా కాస్తున్న భటుడు రాజుపై కత్తి దూశాడు. అయినా, రాజు చటుక్కున తల కిందికి దించి, కత్తివేటు తప్పించుకుని, ఒక్కగెంతున సైనికుణ్ణి కిందికి తోసి చకచకా మెట్లెక్క సాగాడు. మెట్లచివర, పైన ఉన్న తలుపు

మూసి ఉన్నది. రాజు గడియ తీయ సాగాడు. అప్పుడు ఇద్దరు భటులు ఆయన కేసి పరిగెత్తివచ్చారు. కాని, రాజు ఒక్క వేటుతో వాళ్ళిద్దరినీ కిందికి తోశాడు. వాళ్ళు భీకరంగా కేకలు పెడుతూ మెట్లపై బడి దొర్లుకుంటూ కిందపడ్డారు. రాజు తలుపు తెరిచి మేడమీదికి వెళ్ళి నిల బడ్డాడు.



రాజ ప్రాసాదానికి వెలుపల జరుగు తూన్న బాణాసంచా వేడుకలను చూసి జనం ఆనందోత్సాహాలతో ఉప్పొంగిపోతూ కేకలు వేస్తున్నారు; చప్పట్లు కొడు తున్నారు. అమాయకులైన శాంతిపుర ప్రజలు తమ యువరాజు జన్మదినోత్స వాన్ని కోలాహలంగా జరుపుకుంటున్నారు. తమ యువరాజూ, రాజదంపతులూ మృత్యువుతో ముఖాముఖి పోరాటం సాగిస్తున్నారన్న సంగతి వాళ్ళకు తెలియదు పాపం! భక్తి గౌరవాలతో చూసే ప్రజలకూ, రాజుకూ మధ్య కొన్ని గజాల దూరం మాత్రమే ఉన్నది. అయినా, వాళ్ళను చేరుకునే మార్గం రాజుకు కనిపించడం లేదు!

ఎవరో గబగబా మెట్లెక్కి వచ్చే అడు గుల చప్పుడు రాజుకు వినిపించింది. రాజు తలుపు దగ్గర నిలబడి, "ఎవరైనా నన్ను పట్టుకోవాలని ప్రయత్నించారో ప్రాణాలు దక్కవు, జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

"వాణ్ణి చంపండి! పెట్టెనిండా బంగారం బహుమతిగా పొందండి!" అని మెట్లదిగువన నిలబడి ఒకడు వాళ్ళను ఉత్సాహపరుస్తున్నాడు. పేరాశ మనుషుల చేత ఎటువంటి చెడ్డపనులనయినా చేయి స్తుంది. మూర్ఖుల్ని గాడిదలు చేస్తుంది.

"బంగారం! బంగారం!!" అని అరుస్తూ ఇద్దరు భటులు ఒకరిని మించా లని మరొకరు పోటీపడి కత్తిదూసి రాజు కేసి మెట్లెక్కసాగారు.

"ఇదిగో పెట్టెనిండా బంగారం. అందు కోండి," అంటూ రాజు వాళ్ళపైకి కత్తి

చూశాడు. మరుక్షణమే వాళ్ళ చేతుల్లోని కత్తులు ఎగిరి దూరంగా పడ్డాయి. 'అమ్మో' అని చావుకేకలు పెడుతూ వాళ్ళు కిందికి దొర్లిపడ్డారు!

రాజు ప్రస్తుతం సురక్షిత స్థానంలోనే ఉన్నాడు. మెట్లమీదుగా ఎందరు వచ్చినా సరే వాళ్ళను ఆయన అవలీలగా తన కత్తికి ఎరచేయగలడు. అయితే, వీరసింహుడి బలగంలో కొంతమంది, మరొకవైపునుంచి పొడవాటి నిచ్చెన సాయంతో మేడమీదికి రావడానికి ప్రయత్నిస్తున్నారు. రాజు ఈపరిణామాన్ని ముందుగానే ఊహించాడు. ఒకవైపు మెట్లెక్కి వస్తూన్న వారితో పోరాడుతూనే, మరొకవైపుకేసి అప్పుడప్పుడు చూస్తున్నాడు. హఠాత్తుగా ఒక భటుడు మేడమీదినుంచి ఈటెను తనకేసి గురిపెడుతూ రావడం రాజు గమనించాడు. రాజు చటుక్కున కిందికి వంగి, ఒక్క ఊపుతో ముందుకు దూకి ఒక్క తాపు తన్నాడు. ఈటెతో వచ్చిన భటుడు కీచుమని అరుస్తూ నేలపైబడ్డాడు. రాజు వంగి కిందికి చూశాడు. ఇంకా కొందరు నిచ్చెన ఎక్కి వస్తున్నారు. వెంటనే ఆయన నిచ్చెనను కాలితో తన్నాడు.

అయితే, ఈ లోపుగానే మరి కొందరు భటులు మెట్లదారిగుండా మేడ పైభాగానికి వచ్చారు. ఇంకా కొందరు వస్తున్నారు. ఇదే విధంగా వాళ్ళతో పోరాడడం అంత ప్రయోజనకరం కాదనీ, పరిస్థితి మరింత ప్రమాదకరంగా పరిణమించగలదనీ రాజు



గ్రహించాడు. వీరసింహుడు కనీసం వంద మందినైనా వెంటబెట్టుకుని వచ్చి వుంటాడు. కొంతసేపటికి వాళ్ళందరూ తనను చుట్టుముట్టవచ్చు. ఒంటరిగా తను ఎంతమందినని చంపగలడు? మరణం తప్ప మరొక మార్గాంతరం కనిపించడం లేదు. రాజుకు మరణిస్తాననే భయం కలగలేదు. తన బిడ్డనూ, రాణినీ సారంగ మార్గంగుండా తెలియని చోటికి పంపి వేయడం ఆయనకు ఎంతో తృప్తినిచ్చింది. తెలిసివచ్చే మరణాలకన్నా, ఏమవుతుందో తెలియని పరిస్థితే నయమేమో!

శత్రుసైనికులు రాజును సమీపించారు. రాజు తలమీదుగా ఆకాశంలో ఒక బాణాసంచా పేలింది. మెరుపులాంటి దాని వెలుతురులో, భటుల వెనక నిలబడి వున్న వీరసింహుడి ముఖం రాజుకు కనిపించింది.

"నమ్మకద్రోహీ, పాపాత్ముడా, కాచుకో," అంటూ రాజు ఆగ్రహంతో తన నడుముకు వేలాడుతూన్న చురకత్తి తీసి వీరసింహుడి మీదికి విసిరాడు. వీరసింహుడు పక్కకు తప్పుకోవడంతో చావు తప్పించుకున్నాడు. కాని, వాడి ఎడమ చెవి కొద్దిగా తెగిపోయింది.

"చంపండి వాణ్ణి!" అంటూ వీరసింహుడు పట్టరాని ఆగ్రహంతో బిగ్గరగా కేకపెట్టాడు. భటులు అమితోత్సాహంతో రాజును సమీపించబోయారు. కాని, రాజు, ఈలోగా వీరసింహుడి భటులు మళ్ళీ





మేడపైకి వేసిన నిచ్చెనగుండా కిందికి దిగసాగాడు.

''నిచ్చెనను కిందికి తోయండి, కిందికి తోయండి,'' అని ఆజ్ఞాపించాడు వీరసింహుడు. ఆ సమయంలో వాడి భటులు ఒకరిద్దరు నిచ్చెన ఎక్కుతున్నారు. అయినా మేడపైనున్న భటులు నిచ్చెనను కిందికి తోసేశారు. అయితే, ఈ లోపలే రాజు సగందూరం కిందికి వచ్చేశాడు కాబట్టి, ఆయన సులభంగా కిందికి దూకి నిచ్చెనను ఎత్తి, పక్కనే ఉన్న ఎత్తయిన ప్రహరీ గోడకు చేరవేశాడు!

''నిచ్చెనను కిందికి లాగండి! కిందికి లాగండి!'' అంటూ మేడమీదినుంచి వీరసింహుడు అరవసాగాడు. అయినా, ఆసరికి వాడి భటులందరూ మేడమీదికి చేరారు. రాజును ఎలాగైనా పట్టుకుని పెట్టెనిండా బంగారమూ, వీరసింహుడి అభిమానమూ పొందాలన్న ఉత్సాహంతో భటులందరూ మేడపైభాగానికి చేరారు. కిందవున్న భటులిద్దరూ నిచ్చెనపైనుంచి కిందపడడంతో తీవ్రంగా గాయపడ్డారు. వాళ్ళు లేచి నిలబడి కుంటుకుంటూ వెళ్ళి నిచ్చెనను లాగేలోపల రాజు గోడమీదికి చేరుకున్నాడు. అయినప్పటికీ, వాళ్ళు నిచ్చెనను కిందికి లాగడానికి ఎంతో శ్రమ పడుతున్నారు.

''మూర్ఖుల్లారా, ఇంకా ఎందుకు నిచ్చెన పట్టుకుని లాగుతున్నారు? పైకి వెళ్ళి వాణ్ణి చంపండి!'' అని అరిచాడు వీరసింహుడు.

ప్రహరీగోడ నానుకుని సుమతీనది ప్రవహిస్తున్నది. రాజు గోడమీద నిలబడి ఏం చేయాలా అని ఆలోచించసాగాడు. చెవితెగి నెత్తురు కారుతున్నప్పటికీ, పట్టించుకోకుండా వీరసింహుడు గబగబా కిందికి దిగాడు. రాజు ప్రాణాలతో తప్పించుకుంటే వాడి ప్రాణం దక్కదు. ''ఎక్కండి. ఎక్కండి. పైకి వెళ్లి రాజును ఎలాగైనా హతమార్చండి!'' అని భటుల్ని పురికొల్పుతూ, వీరసింహుడు ఒక ఈటెను

రాజుకేసి గురిపెట్టాడు. గురిచూసి కొట్ట డంలో వీరసింహుడు కడునేర్పరి. ఆ నైపుణ్యానికి మెచ్చి, రాజు వాణ్ణి ప్రత్యే కంగా సత్కరించాడు కూడా.

వీరసింహుడు, ఈటెను గురిచూసి రాజుమీదికి విసిరాడు. వెన్నెల ఆకాశంలో ఈటె రివ్వున ముందుకు దూసుకు పోయింది. అయితే, అది రాజుకు తగి లిందా లేదా అన్నది ఎవరూ చూడలేదు. హఠాత్తుగా రాజు గోడ మీదినుంచి అదృశ్య మయ్యాడు.

వీరసింహుడు వేగంగా నిచ్చెన ఎక్కి గోడమీదికి వెళ్ళి చూశాడు. రాజు నది లోకి పడిపోయి ఉండాలి; లేదా కావాలనే నదిలోకి దూకి వుండాలి. ఈటె తగిలి వుంటే ఆయన పడిపోయి వుంటాడు. తగలకుండా ఉన్నట్టయితే, రాజు కావా లనే నదిలోకి దూకి వుండాలి. ఏం జరి గిందో తెలుసుకోవడం ఎలా? రాజు మరణించాడా? ప్రాణాలతో తప్పించు కున్నాడా? తెలుసుకోవడం ఎలా?

''నేను విసిరిన ఈటె రాజుకు తగలడం ఎవరైనా స్పష్టంగా చూశారా?'' అని అడిగాడు వీరసింహుడు తన చుట్టూ చేరిన భటులను చూసి.

పెట్టెనిండా బంగారం అందకుండా జారిపోయిందికదా అని భటులందరూ నిరుత్సాహంగా కనిపించారు.

''ప్రభువులు విసిరిన ఈటె గురి ఎలా తప్పుతుంది మహారాజా!'' అన్నాడు వాళ్ళలో ఒకడు వీరసింహుణ్ణి పొగడాలన్న ఉద్దేశంతో.

''నోర్ముయ్. నా ఈటె తగిలి రాజు నదిలోకి పడడం నువ్వు చూశావా? చూసి వుంటే చెప్పు. లేకుంటే నోరు మూసుకో, పిచ్చి వాగుడు కట్టిపెట్టు,'' అన్నాడు వీర సింహుడు కోపంగా.

అందరూ మౌనం వహించారు. వీర సింహుడు వేగంగా ప్రవహిస్తూన్న నదీ ప్రవాహం కేసి చూడసాగాడు. గలగలా ప్రవహిస్తూన్న నది వాణ్ణి చూసి పకపకా నవ్వుతున్నట్టనిపించింది! -(ఇంకావుంది)







# శూరసేనుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రివేళ, భయంకరమైన వాతావరణంలో, ఇతరులకోసం నువ్వు పడుతున్న శ్రమ మరొకరికి సాధ్యమయ్యేది కాదు. అయితే, తమ అవసరం తీరిన తర్వాత, నిన్నీపనికి పురికొల్పినవాళ్ళు, తగినంతగా నిన్ను గౌరవిస్తారా అన్న అనుమానం కలుగుతున్నది. ఒక దేశానికి అధిపతీ, మంచి పండితుడూ అయి వుండి కూడా, శూరసేనుడనే రాజు, తనకు సహాయం చేసిన వ్యక్తి పట్ల అక్రమంగా ప్రవర్తించినవైనం, ఈ సందర్భంలో నువ్వు తెలుసుకోవడం ఎంతైనా అవసరం. నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు

## బేతాళ కథలు



అతడి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం గాంధారదేశాన్ని శూరసేను డనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయన మంచి పరిపాలనాదక్షుడే కాక, గొప్ప పండితుడూ, కళాపోషకుడు కూడా. ఆయనకు చిత్రలేఖనమన్నా, నాట్యమన్నా విపరీతమైన అభిమానం. ఆయన ఆస్థానంలో కవులతోబాటు చిత్రకారులూ, నర్తకులూ కూడా వుండేవారు. కాని శూర సేనుడికి వారి కళానైపుణ్యం పరిపూర్ణ మైన తృప్తినిచ్చేదికాదు.

ఒకసారి శూరసేనుడు నిండుసభలో వుండగా, కొందరుభటులు, జీర్ణవస్త్రాలతో, తైలసంస్కారం లేని జుట్టుతో, దీనంగా వున్న ఒక యువతిని తీసుకువచ్చి, రాజు ఎదుట నిలబెట్టి, ''మహారాజా, ఈమె స్వర్ణముఖీనదిలో కొట్టుకువస్తూ, మాకు కనిపించింది. వెంటనే రక్షించి, బంధు వులవద్దకు చేరుద్దామని వివరాలు అడిగాం. ఎంతగా ప్రశ్నించినా కంటికీ, మంటికీ ఏకధారగా విలపిస్తూందే గాని, పెదవి విప్పడం లేదు!'' అని చెప్పారు.

రాజు, ఆమెను తేరిపారజూసి ఆశ్చర్య పడ్డాడు. ఎందుకంటే—అంతటి దీన స్థితిలో కూడా, ఆమె సౌందర్యం బురద లోని పద్మంలా ప్రకాశిస్తున్నది.

శూరసేనుడు ఆమెకేసి జాలిగా చూస్తూ, ''ఎవరమ్మా నువ్వు? నదిలో ఎలా పడ్డావు?'' అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే, ఆ యువతి చేతుల్లో ముఖం దాచుకుంటూ, భోరుమన్నది.

శూరసేనుడు ఒక్క క్షణం ఆలోచించి, ''సరే, ప్రస్తుతానికి యీమెను, మహారాణి అంతఃపురానికి తీసుకువెళ్ళి అప్ప జెప్పండి,'' అన్నాడు.

ఆ సాయంత్రం శూరసేనుడు, మహా రాణి లీలావతిని చూడబోయి, ''ఏం, దేవీ! ఉదయం నేను పంపించిన స్త్రీ, ఏమైనా కోలుకున్నదా? వివరాలేమైనా తెలిశాయా?'' అని అడిగాడు.

''లేదు, ప్రభూ! నేను ఎంతగానో ప్రయత్నించిన మీదట, ఆమె తన పేరు మల్లిక అనీ, తానొక దురదృష్టవంతురాలి ననీ మాత్రం చెప్పింది. తనను గురించిన వివరాలేవీ, ప్రస్తుతం అడగవద్దని ప్రార్థించింది. అయితే, యింతకుముందొక విషయం మాత్రం తెలిసింది. ఆమె సామాన్యురాలు కాదు; బహుముఖ ప్రజ్ఞాశీలి! సాటిలేని కళాకారిణి,'' అంటూ, రాణి చెలికత్తెకు సైగచేసింది.



చెలికత్తె వెంటనే ఒక చిత్రాన్ని తీసుకు వచ్చి, రాజుకు అందించింది. శూరసేనుడు, ఆ చిత్రాన్ని చూస్తూనే దిగ్భ్రాంతి చెందాడు. ఆ చిత్రం మల్లికదే! ఉదయం సభలో ఎంతటి దీనస్థితిలో కనిపించిందో, అంత దీనంగానూ చిత్రించబడింది.

శూరసేనుడు ఆశ్చర్యంగా, ''చిత్ర లేఖనం అపూర్వం! ఎవరు చిత్రించారు?'' అని ప్రశ్నించాడు.

లీలావతి చిరునవ్వుతో, ''ఆ చిత్రంలో వున్న యువతే, ఆ చిత్రాన్ని లిఖించిన చిత్రకారిణి,'' అని జవాబిచ్చింది.

''ఏమిటీ, మల్లికే దీన్ని స్వయంగా చిత్రించిందా?'' అన్నాడు.

''అవును. మల్లిక తనకు చిత్రలేఖనంతోపాటు, నాట్యం కూడా తెలుసునన్నది. మీరు పరీక్షించి, సంతృప్తి చెందితే మన కొలువులో వుండి పోతానని చెప్పింది. మీరు వచ్చినతర్వాత, నాట్యాన్ని ప్రదర్శిస్తానన్నది,'' అని చెప్పింది లీలావతి.

''అయితే, ఆమె నాట్యంలో ఏపాటి సమర్థురాలో చూడాలని వున్నది,'' అన్నాడు శూరసేనుడు.

కొద్దిసేపటి తర్వాత, లీలావతి చెలికత్తె, నర్తకి వేషంలో వున్న మల్లికను, అక్కడికి తీసుకువచ్చింది. సాలంకృత అయివున్న ఆమెను చూసి, శూరసేనుడు ముగ్ధుడై పోయాడు.

లీలావతి, భర్తను, ''నృత్యం ప్రారంభించమంటారా, ప్రభూ?'' అని అడిగింది.



శూరసేనుడు, ప్రారంభించమన్నట్టుగా తల వూపాడు.

వెంటనే మల్లిక రాజదంపతులకు వినయంగా వంగి నమస్కరించి, నాట్యం ప్రారంభించింది.

నాట్యం పూర్తికాగానే, శూరసేనుడు చప్పట్లుకొడుతూ, "శభాష్, మల్లికా! నువ్వు మల్లికవు కాదు, మయూరకన్యవు. నా కళాతృష్ణను గమనించి, నటరాజు నాకు ప్రసాదించిన కళాభినేత్రివి! నీ రాకతో, నా కొలువులో ఒక పెద్ద లోటు తీరింది," అన్నాడు.

మల్లిక ఆనందంగా రాజదంపతులకు, తన కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోయింది.

శూరసేనుడు అక్కడి నుంచి తిన్నగా, రహస్యాలోచనామందిరానికి వెళ్ళి, మంత్రి కేశవభట్టుకు కబురంపాడు. అతడు రాగానే, శూరసేనుడు, మల్లికను గురించి వివరంగా చెప్పి, ఆమెను ఆస్థాననర్తకిగా నియమించినట్టు తెలిపాడు.

అంతా విన్న కేశవభట్టు ఆందోళనగా, "ఎంతపని చేశారు, ప్రభూ! సౌందర్యవతీ, నేర్పరీ అయిన స్త్రీని, ప్రజాప్రాముఖ్యం గల అటువంటి పదవిలో, పూర్తివివరాలు తెలుసుకోకుండా నియమించడం మంచిది కాదు. ఇప్పుడైనా మించిపోయింది లేదు. ఆమెకు కేవలం ఆశ్రయం మాత్రం కల్పించి, కొలువులో స్థానం యివ్వడానికి వీలులేదని చెప్పండి," అన్నాడు.

"అలా కాదు. ఆమెకు కొలువులో స్థానం యివ్వడానికే నిశ్చయించాను," అన్నాడు శూరసేనుడు.

కేశవభట్టు, ఆశ్చర్యంగా చూశాడు. అది గమనించిన శూరసేనుడు, "నేను మొదట వాగ్దానం యివ్వడమే పొరబాటయిందని, నేను అంగీకరిస్తున్నాను. కాని, పునరాలోచిస్తే, వాగ్దానాన్ని నిలబెట్టుకోవడమే మంచిదనిపిస్తున్నది. మనం అనుమానిస్తున్నట్టు ఆమె ఏ దేశపు గూఢచారిణో కావచ్చు; కాకపోవచ్చు. ఏమైనా మన జాగ్రత్తలో మనం వుందాం!" అన్నాడు.



కేశవభట్టుకు, రాజు వాదన అంతగా నచ్చలేదు. అందువల్ల, ఆయన మౌనంగా తన అంగీకారాన్ని తెలియజేశాడు.

మల్లిక గాంధారదేశపు ఆస్థానన ర్తకిగా నియమించబడింది. ఆమె చిత్రించిన చిత్రాలు, రాజభవనాన్ని అలంకరించాయి. సామాన్య పౌరుడి దగ్గిర నుంచి, ముఖ్య రాజోద్యోగివరకూ, మల్లిక సౌందర్యానికీ, నృత్యానికీ జేజేలు పలకసాగారు. క్రమంగా మల్లిక ఆశ్రితజనం ఎక్కువైంది.

అందరికంటే ఎక్కువగా మల్లిక నాట్యాన్నీ, చిత్ర కళానైపుణ్యాన్నీ అభిమానిస్తున్నా, శూరసేనుడు, రాజుగా తన కర్తవ్యాన్ని మరిచిపోలేదు. మల్లికను ఒకకంట కనిపెట్టి వుండేందుకు చారులను నియమించాడు.

అయితే, చేతులు కాలాక ఆకులు పట్టుకున్న చందమయింది, శూరసేనుడి స్థితి. మల్లిక గాంధారదేశానికి పొరుగున వున్న కళింగదేశ గూఢచారి అని రుజువై, శూరసేనుడు, ఆమెను ఆస్థానం నుంచి తొలగించేనాటికి, హఠాత్తుగా కళింగ సైన్యాలు గాంధార మీదికి విరుచుకు పడ్డాయి. యుద్ధానికి సిద్ధంగా లేని గాంధార, కళింగరాజు వికర్ణుడి వశమైంది.

రాణి లీలావతిని ఆమె చెలికత్తెలూ, కొందరు సైనికులూ కలిసి, రాజభవనం నుంచి వున్న రహస్య మార్గంగుండా తీసుకుపోయి, కొన్ని రోజుల తర్వాత, ఆమె తండ్రిగారయిన చంపకరాజు వద్దకు చేర్చారు.

ఓడిన సైన్యం నుంచి వేరుపడి, సరిహద్దుల కావలనున్న భిల్లరాజు సాయం కోసం వెళుతున్న శూరసేనుడికి, కాలిబాట పక్కన ఒక జ్యోతిష్కుడు కనిపించాడు. అతడిచుట్టూ చాలామంది మూగి వున్నారు. శూరసేనుడు కూడా అప్రయత్నంగానే అటు వెళ్ళి, జోస్యగాడికి తన చెయ్యి చూపించాడు.

జోస్యగాడు, ఆయన చెయ్యి చూస్తూనే, "ఆహాఁ, మహారాజయోగం గల చెయ్యి!



తప్పు చేశానని బాధపడుతున్నావు. కాని, దురదృష్టమే అదృష్టమవుతుంది. నీకు అంతా శుభమే జరుగుతుంది,'' అన్నాడు.

అప్పటివరకూ, పొరబాటుచేసి రాజ్యం పోగొట్టుకున్నానని బాధపడుతున్న శూరసేనుడికి, జోస్యగాడి మాటలు నూతనోత్సాహాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ కలిగించాయి.

ఆయన అక్కడి నుంచి వెళ్ళబోతూండగా, జోస్యగాడు ఒక రైతుయువకుడి చెయ్యి చూస్తూ, ''ఆహాఁ, చక్రవర్తులను తోసిరాజనేహస్తం! ఇప్పుడు పేదరికంలో వున్నానని బాధపడుతున్నావు. కాని, త్వరలోనే ఇంద్రభోగాలు అనుభవిస్తావు!'' అన్నాడు.

ఆ మాటలు విని శూరసేనుడు నవ్వుకుని, భిల్లరాజున్న ప్రాంతం కేసి ప్రయాణం సాగించాడు.

ఆ తర్వాత కొద్దిరోజులకు, శూరసేనుడి మామ అయిన చంపకరాజు కళింగ మీదికీ, భిల్లరాజుసహాయంతో శూరసేనుడు, తన దేశాన్ని ఆక్రమించిన వికర్ణుడి మీదికీ దండెత్తిపోయి, రెండు దేశాలనూ ఆక్రమించుకున్నారు.

తిరిగి రాజైన వెంటనే శూరసేనుడు, మల్లికను పిలిపించి, ''మల్లికా, కళింగ రాజ్యం కూడా మా స్వాధీనమైన విషయం తెలిసిందా?'' అంటూ కటువుగా ప్రశ్నించాడు.

మల్లిక తెలిసిందన్నట్టుగా తల వూపింది.

''అయితే యింకొక విషయం కూడా తెలుసుకో! నువ్వు శూరసేనుడి ఆస్థాన నర్తకివి. కేవలం నర్తకివి మాత్రమే! అర్థమైందా?'' అని అడిగాడు శూరసేనుడు.

ఎలాంటి శిక్షపడుతుందో అని భయపడుతున్న మల్లిక, శూరసేనుడికికృతజ్ఞతా పూర్వకంగా నమస్కరించి, అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

తర్వాత శూరసేనుడు, తాను జోస్యం చెప్పించుకున్న జోస్యగాణ్ణి పిలిపించి, ''ఈనాటి నుంచీ నువ్వు జోస్యం చెప్పేం

దుకు వీలులేదు. నిన్ను మా భటుడిగా నియమిస్తున్నాను,'' అన్నాడు.

అంతేకాక, దేశంలో ఎవ్వరూ చిలక జోస్యం, హస్తసాముద్రికం వంటి వాటిని, వృత్తులుగా స్వీకరించరాదనీ, వాటిని శాస్త్రాలుగా మాత్రమే పరిగణించాలనీ శాసనం చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, శూరసేనుడి ప్రవర్తన ధర్మవిరుద్ధంగా లేదా ? తనను మోసగించిన మల్లికను, తిరిగి అందలం ఎక్కించి, తనలో నూతనోత్తేజాన్ని కలిగించిన జోస్యగాణ్ణి, ఆ వృత్తి నుంచి తప్పించాడు. ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''శూరసేనుడి ప్రవర్తనలో ధర్మవిరుద్ధమైనదేమీ లేదు. జోస్యగాడికి శాస్త్రపరిజ్ఞానం ఏమీ లేదని, అతడు రైతుయువకుడికి చెప్పిన మాటల ద్వారా ఆయన గ్రహించాడు. అటువంటి వాళ్ళు చెప్పే జోస్యం, ప్రజల మానసిక స్థితికి హాని కలిగిస్తుంది. ఇలాంటి ప్రమాదాలను అరికట్టేందుకే రాజు, జ్యోతిశ్శాస్త్రాన్ని బాటపక్కన పరవడాన్ని నిరోధించాడు. జోస్యగాడు నిర్భాగ్యుడు కాకుండా, వాడికి తన కొలువులో ఉద్యోగం యిచ్చాడు.

ఇక మల్లిక సంగతి: వ్యక్తిగా ఆమె అపూర్వకళాకారిణి. రాజు కళాప్రియుడు. మల్లికను గూఢచారిణిగా ఉపయోగించుకున్న రాజు, సింహాసనాన్ని కోల్పోయాడు. అంటే—యిప్పుడు మల్లిక, వీరుడి చేతిలో లేని ఆయుధం! అది తళతళ మెరవగలదే గాని, తనంతట తాను ఎవరి శిరస్సునూ ఖండించలేదు. అందువల్లనే, శూరసేనుడు, ఆమెకున్న కళాప్రావీణ్యాన్ని తన దేశానికి స్వంతం చేసుకుని మంచి విజ్ఞత చూపించాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# చిలుకమౌనం

మంచి న్యాయనిర్ణేత అయిన రాజొకడు, న్యాయవిచారణ చేసేటప్పుడు, మాటలు నేర్చిన దేవతాచిలుక ఒకటి ఎక్కడినుంచో వచ్చి, తీర్పు అయిపోయిన తర్వాత, 'సెభాష్' అని అరుస్తూ సభలోనుంచి ఎగిరి వెళ్ళిపోయేది.

ఆ రాజ్యంలోనే వుండే మోసగాడొకడికి, చిల్లర మోసాలమీద విసుగుపుట్టి, ఏవైనా పెద్దవి రెండు, మూడు మోసాలుచేసి, మిగిలిన జీవితమంతా సుఖంగా గడపాలనుకున్నాడు.

మొదటగా వాడు, ఒక పెద్ద సముద్ర వ్యాపారి ఇంటచేరి, చిత్తశుద్ధిగా పని చేస్తున్నట్టు నటించి, త్వరలోనే ఆయన నమ్మకాన్ని సంపాయించాడు.

ఒకనాడు వాడు, వర్తకుడితో, ''అయ్యగారూ, రేవులోకి సుగంధద్రవ్యాల ఓడ ఒకటి రేపు వస్తున్నది. కొంత డబ్బు యిప్పించారంటే, మనకు ఎక్కువ లాభం కలిగేలా సరుకు కొనుగోలు చేస్తాను,'' అన్నాడు.

''ఒరే, వాటిమీద అట్టే లాభాలు రావడం లేదురా!'' అంటూ వ్యాపారి నవ్వాడు, ఆ విషయాన్ని తేలిగ్గా తీసిపారేస్తూ.

కాని మోసగాడు ఆయన్ని ప్రాధేయపడి ఒప్పించి, కొందరు నాటకాలరాయుళ్ళకు వ్యాపారుల్లా వేషాలువేసి, రేవు వద్దకు ముందుగా పంపాడు. ఓడ రాగానే వాళ్ళు విదేశీ వ్యాపారుల్ని కలుసుకుని, ఆ ఏడు సుగంధద్రవ్యాలకు గిరాకీ పడిపోయిందని నమ్మించారు. వెనుకగావచ్చిన మోసగాడు, ఆ సరుకునంతా తక్కువ ధరకు కొనేసి, యజమాని అయిన వ్యాపారికి పదిరెట్లు లాభం చూపించాడు.

కొన్నాళ్ళ తర్వాత వ్యాపారి, మోసగాడిని పిలిచి, ''ఒరే, ముత్యాలవర్తకు

డాక్టర్॥ కె. వి. రమణరావు

లున్న ఓడ ఒకటి రాత్రికి రేవు చేరుకుంటున్నది. మునుపటిలాగే సరుకు చవగ్గా పట్టుకొనిరా,'' అంటూ వాడికి హెచ్చుమొత్తంలో డబ్బిచ్చాడు.

మోసగాడు యిదే అదను అనుకుని, ఆ రాత్రికి రాత్రే డబ్బుతో సహా పారిపోయాడు.

మరొక ఊరు చేరిన మోసగాడు, ఈసారి సంపన్నుడైన ఒక కవి ఇంట చేరాడు.

ఒకనాడు వాడు మాటలమధ్యలో, ''మహాకవులైన మీ ప్రతిభకు రావలసినంత గుర్తింపు రాలేదు!'' అంటూ లేని విచారం నటించి, ''మీ పేరు రాజాస్థానంలో మారుమోగడానికి దివ్యమైన ఒక మార్గం వున్నది,'' అన్నాడు.

''ఏమిటది?'' అని అడిగాడు కవి ఆశగా.

''మీరు కొంత ఖర్చుకు వెనకాడకపోతే, మీకు ఘనంగా సన్మానం చేయించి, రాజ్యమంతటా మీ కీర్తి వ్యాపించేలా చేస్తాను,'' అన్నాడు మోసగాడు.

కవి, వాడికి పుష్కలంగా డబ్బిచ్చాడు. మోసగాడు, ఆ డబ్బుతోపాటు అమాయకులైన మరికొందరి దగ్గిర చందాలంటూ డబ్బు వసూలుచేసి, పారిపోయి రాజధాని చేరుకున్నాడు.

ఈసారి వాడు రాజుగారి ఆస్థానంలో పెద్ద ఉద్యోగంలో చేరాలని ఉబలాటపడే ధనికుడైన ఒక యువకుడి ప్రాపకం సంపాయించి, మాటల ధోరణిలో, ''మీరు



కాలాన్నిలా ఎందుకు వృథా చేస్తున్నారో, నాకర్థం కావడంలేదు. మీరు రాజుగారి కొలువులో వుండి వుండవలసినవారు!'' అన్నాడు.

''ఏం చేయమంటావు? రాజాస్థానంలో పలుకుబడిగలవారెవర్నీ, నేనెరగనే!'' అన్నాడా యువకుడు విచారంగా.

''మీరు కొంత సొమ్ము ఖర్చు చేసేట్టుంటే, నా పలుకుబడి ఉపయోగించగలను,'' అంటూ, యువకుడి దగ్గిర పెద్దమొత్తంలో డబ్బు తీసుకుని పారిపోతూ, వాడు అనుకోకుండా రాజభటులకు దొరికి పోయాడు.

రాజు విచారించి, మోసగాడికి కఠిన కారాగారవాసశిక్ష విధించాడు. సభలో వున్న వాళ్ళందరూ హర్షధ్వానాలు చేశారు. కానీ అక్కడ వున్న చిలుక మాత్రం మౌనం దాల్చింది.

ఇది చూసి రాజు కొంతసేపు తీవ్రంగా ఆలోచించి, ఫిర్యాదు చేసిన ముగ్గురికీ తేలికపాటి శిక్ష విధిస్తున్నట్టు ప్రకటించాడు. చిలుక, ''సెభాష్!'' అంటూ ఎగిరి వెళ్ళిపోయింది.

''మహారాజా, ఇది అన్యాయం! మోసం చేసింది వాడు; మోసపోయిన వాళ్ళం మేము,'' అన్నారు వర్తకుడూ, కవీ, ధనిక యువకుడూ ఒకేసారి.

రాజు, వ్యాపారికేసి చూస్తూ, ''సుగంధ ద్రవ్యాలమీద మొదట వచ్చిన లాభం అన్యాయమని తెలిసీ, మళ్ళీ దురాశకు పోవడం, నీ తప్పు!'' అన్నాడు.

తర్వాత కవితో, ''నీ స్థాయికి మించిన పేరు రావాలనే కీర్తిదాహంతో ప్రవర్తించడం, నీ తప్పు!'' అన్నాడు.

రాజు, ధనికయువకుడికేసి తీవ్రంగా చూస్తూ, ''అర్హతలేకపోయినా, లంచమిచ్చి కొలువు సంపాదించాలని, నువ్వు తప్పుదారి తొక్కావు!'' అన్నాడు.

ముగ్గురూ సిగ్గుతో తల్లలు వంచుకున్నారు. ఏ బలహీనతలూ లేనివాళ్ళను, ఏ మోసగాళ్ళూ ఏమీ చేయలేరని అప్పటికి గాని వాళ్ళకు అర్థం కాలేదు.



# చందమామ అనుబంధం—12

# మన విజ్ఞాన సంపద

## ఎవరామె?

దేశసంచారి అయిన ఒక సాధువు, ఒక ఇంటికి అతిథిగా వచ్చాడు. సాధువును చూసి పరమానందం చెందిన ఆ ఇంటి యజమానీ, యజమాని కూతురూ ఎంతో భక్తిశ్రద్ధలతో ఆయనను ఆదరించారు. వారి ఆతిథ్యానికి సంతసించి సాధువు అక్కడే కొన్నాళ్ళు గడిపాడు. ఆ సమయంలో ఆ చిన్నారి, సాధువుకు రేయింబవళ్ళు సేవచేసింది. సాధువు పాదాల చెంత కూర్చుని, ఆయన చెప్పే కృష్ణుడి కథలను ఆసక్తితో ఆలకించసాగింది. ఆ సాధువు దగ్గర వున్న చిన్న కృష్ణవిగ్రహాన్ని చూసి, ఆ అమ్మాయి పరవశం చెందింది. విగ్రహం ముందు పాటలు పాడేది; నృత్యం చేసేది।

ఒకనాటి వేకువజామున సాధువు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఆ అమ్మాయి నిద్రలేచి, సాధువూ, తను ప్రాణసమానంగా భావించిన కృష్ణవిగ్రహమూ కనిపించకపోయేసరికి చెప్పరాని దుఃఖంతో విలపించింది. ఆ విగ్రహాన్ని చూడకుండా, పచ్చినీళ్ళయినా ముట్టుకోనని పట్టుపట్టింది. ఆమెను ఎవరూ ఓదార్చ లేకపోయారు। ఆ రోజు రాత్రి సాధువు మార్గమధ్యంలో ఒక గుడిలో పడుకున్నాడు. విగ్రహం లేదని కన్నీరు మున్నీరుగా విలపిస్తున్న బాలిక ఆయనకు కలలో కనిపించింది. విగ్రహ రూపంలోని దేవుడూ ఆమె వద్దకే చేరుకోవాలనుకుంటున్నట్టు సాధువుకు అనిపించింది. ఆయన వెంటనే ఇంటికి తిరిగి వచ్చి తన దగ్గర వున్న విగ్రహాన్ని ఆ అమ్మాయికే ఇచ్చాడు।

ఆ అమ్మాయి ఎవరో మీకు తెలుసా?

(36 వ పేజీ చూడండి)

## మీకు తెలుసా?

1. బ్రిటిష్ రాజకుటుంబవశంలో వున్న, పురాణకాలం నాటిదని భావించబడే భారతీయ ఆభరణం ఏది?
2. మొగలుల దురాక్రమణ నుంచి అహమద్‌నగర్‌ను చాలాకాలం కాపాడిన వీరవనిత ఎవరు?
3. స్వతంత్ర భారతదేశంతో కలిసిన చిట్టచివరి విదేశ ఆక్రమిత ప్రాంతం ఏది?
4. ప్రపంచంలోకెల్లా అతి చిన్న చిట్టెలుక ఏది?
5. దాని బరువెంత?
6. అత్యంత భయానకమైన వినాశం కలిగించిన భూకంపం ఎప్పుడు ఎక్కడ ఏర్పడింది?

(36 వ పేజీ చూడండి)

# దండకారణ్యం




మన పురాణ ఇతిహాసాలలోని ఎన్నో రసవత్తర ఘట్టాలకు వేదికగా, సాక్ష్యంగా నిలిచింది దండకారణ్యం. ప్రాచీన కాలం నుంచి ఎందరో మహామునులు ఈ ప్రాంతంలో నివసించారు. దండకారణ్యంలో రాక్షసులూ వుండేవారని చెబుతారు. సీతారామలక్ష్మణులు ఈ అరణ్యంలోనే కొంతకాలం వాసం చేశారు.

దండకారణ్యానికి ఒకవైపున గోదావరి, మరొకవైపున నర్మద ప్రవహిస్తున్నవి. మత్స్యకుండ్, ఇంద్రావతి, వంశధార, నాగావళి, తమస మొదలైన నదులు ఈ మహారణ్యం గుండా ప్రవహిస్తున్నవి. ఈ మహారణ్యం ఈనాటి మధ్యప్రదేశ్, ఒరిస్సా, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ ప్రాంతాలకు విస్తరించి ఉన్నది.

ఒకానొకప్పుడు దండకుడనే రాజు అరణ్యంలో సంచరిస్తూండగా అరజ అనే ఒక అందాల మునికుమారి కనిపించింది. ఆమెను బలవంతంగా తన వెంట తీసుకుపోవడానికి రాజు ప్రయత్నిం

చాడు. కాని ఆమె తప్పించుకుని వెళ్ళి తన తండ్రి అయిన శుక్రుడితో జరిగిన అవమానం గురించి చెప్పింది. శుక్రుడు ఆగ్రహం చెంది దండకుడి రాజధానీ నగరం బూడిదయిపోవాలని శపించాడు. మరుక్షణమే ఆ నగరం అగ్నిజ్వాలలకు ఆహుతయిపోయిందట. కాలక్రమేణా అక్కడ అరణ్యం ఏర్పడిందట. దండకుడు పరిపాలించిన ప్రాంతం కాబట్టి దానికి దండకారణ్యం అనే పేరు ఏర్పడిందని చెబుతారు.

ఈనాటి దండకారణ్యం ఆటవిక సంపదకు నిలయంగా ఉంటున్నది. దేశానికి సక్రమమైన శీతోష్ణస్థితి ఏర్పడడానికి ఈ మహారణ్యం దోహదం చేస్తున్నది.

అయినా, ఇటీవలికాలంలో కట్టెలు కొట్టేవారి బెడద ఎక్కువై ఇక్కడి అడవులు క్రమేణా నశించిపోతున్నాయి. తూర్పు కనుమలు అని పిలువబడే ఈ అరణ్యంలోని కొండలకు కూడా హాని కలుగుతున్నది!

## టైప్‌రైటింగ్ చాంపియన్

హిమాచలప్రదేశ్, సోలాన్‌జిల్లా చియాన్ గ్రామానికి చెందిన 45 యేళ్ళ రాజీందర్‌సింగ్ అనే దంతవైద్యుడు టైపు చేయడంలో మూడవసారి ప్రపంచ చాంపియన్‌గా ఎన్నికయ్యాడు.

డ్రెస్డన్‌లో జరిగిన 18 వ ప్రపంచ చాంపియన్‌షిప్ పోటీలలో పాల్గొని, తను పుట్టడానికి ఐదేళ్ళకు పూర్వం రూపొందించబడిన రెమింగ్టన్ టైప్‌రైటర్ మీద నిమిషానికి 499 అక్షరాలు టైపుచేసి బంగారుపతకం సాధించాడు రాజీందర్ సింగ్।



# చందమామ కబుర్లు



## తెల్ల పులిపిల్ల!

కలకత్తా, అలిపూర్ జంతుప్రదర్శనశాలలో ప్రప్రథమంగా పుట్టిన తెల్లపులిపిల్లను, తల్లి 'హిమాద్రి జూనియర్'తోపాటు ఇటీవల అందరూ చూడడానికి రెండు గంటలసేపు ఉంచారు. నల్లటిచారలు గల ఈ ముచ్చటయిన బుల్లిపులి గత మే 3 న పుట్టింది. పుట్టిన నాటినుంచి మూడవసారిగా ఎండకన్ను చూసిన ఈ పులిపిల్ల బోనులో అటు ఇటూ తిరగసాగింది. ఈ పిల్లను ఎప్పుడూ తల్లికి చేరువగానే ఉంచారు. తల్లి కూడా దీనిని వదిలి ఉండడానికి ఇష్టపడడం లేదు।

# సాహిత్యావలోకనం

1. రాబిన్‌సన్ క్రూసోకు నమూనాగా నిలబడిన మనిషి పేరేమిటి ?
2. ఆంగ్ల నవలాకారుడు జార్జ్ ఇలియట్ అసలు పేరేమిటి ?
3. పెద్ద గ్రంథాలయం కలిగిన పురాతన భారతీయ విశ్వవిద్యాలయం ఏది ?
4. చంద్రగుప్త మౌర్యుడి కథను తెలియజేసే సంస్కృత నాటకం ఏది ?
5. ప్లాటో రచించిన గొప్ప గ్రంథం పేరేమిటి ?
6. ప్లాటో ఎప్పుడు జీవించాడు ?

## సమాధానాలు

ఎవరామె ?

భక్తురాలూ, కవయిత్రీ అయిన మీరాబాయి.

మీకు తెలుసా ?

1. కోహినూర్ వజ్రం
2. చాంద్ బీబీ
3. గోవా
4. ఇటలీకి చెందిన ఎట్రూస్కాన్ చిత్రలిపిక
5. బొన్నులో పదోవంతు
6. 742 వ సం॥లో. ఈజిప్టు, పాలస్తీనా, సిరియా లలో దాదాపు 300 పట్టణాలను ధ్వంసం చేసింది.

సాహిత్యం

1. అలెగ్జాండర్ సెల్‌కర్క్
2. మేరీ అన్ ఇవాన్స్
3. నలందా విశ్వవిద్యాలయం
4. విశాఖదత్తుడి ముద్రారాక్షసం
5. 'ది రిపబ్లిక్'
6. క్రీ. పూ. 5-4 శతాబ్దాలలో.



# నెహ్రూ కథ – 10

నెహ్రూ జైలునుంచి విడుదల అయ్యాక అనారోగ్యంతో బాధపడుతున్న తన తండ్రిని చూడడానికి ముసూరీకి వెళ్ళాడు. ఆయన ఆరోగ్యం కాస్త కుదుట బడ్డాక ఇద్దరూ అలహాబాదుకు తిరిగి వచ్చారు. ఒకనాటి సాయంకాలం, నెహ్రూ బ్రహ్మాండమైన రైతుసభలో ఉపన్యసించాడు.

సభముగిశాక, నెహ్రూ తన సతీమణితో కలిసి, తండ్రిని చూడడానికి అదుర్దాగా ఇంటికి బయలుదేరాడు. కాని, ఇంటి ఆవరణలో అడుగు పెట్టేసరికే పోలీసులు ఆయన్ను మళ్ళీ ఖైదుచేసి తీసుకు పోయారు.





కమలానెహ్రూ, ఒంటరిగా వెళ్ళి అకస్మాత్తుగా జరిగిన ఖైదు గురించి మామగారికి చెప్పింది. మోతీలాల్ ఎంతో ఆశాభంగం చెందాడు. మౌనంగా ఆయన ఒక నిర్ణయం తీసుకున్నాడు.



మోతీలాల్ చటుక్కున లేచి కూర్చు న్నాడు. రెండుసార్లు బల్ల గుద్దాడు. ఇంకా ఇలాగే పడుకుని ఈ దురన్యా యాన్ని సహించబోనన్నాడు. ఆయన శారీరకంగా ఎంతో బలహీనంగా వున్నప్ప టికీ, మానసికంగా చాలా శక్తివంతంగా ఉన్నాడు.

ఆసమయంలోనే కాంగ్రెసు నాయకులు అక్కడక్కడా సభలూ, సమావేశాలూ ఏర్పాటు చేసి, నెహ్రూ ఖైదుకు కారణ మైన—ప్రభుత్వానికి ఎదురు తిరగమని ఆయన చేసిన ఉపన్యాసం చదివారు. అటువంటి సభలను చెల్లాచెదరు చేయ డానికి పోలీసులు లాఠీలు ప్రయోగిం చారు.





ఈ ఉద్యమంలో పాల్గొన్నవారిని భయ పెట్టడానికి కేవలం జైలుపాలు చేయడం మాత్రమే కాకుండా కొరడాలతో కొట్టడం ప్రారంభించారు. ఇది అవమానకరం గానే కాకుండా శారీరకంగా ఎంతో బాధాకరంగానూ పరిణమించింది.

కొరడాలతో కొట్టడాన్ని వ్యతిరేకించి, నెహ్రూ, జైలులో వున్న ఆయన అనుచరులూ, నాలుగు రోజులు నిరాహార దీక్ష వహించారు. ఆ విధంగా, జైలు లోపల జరిగే ఆ ఆటవిక చర్య గురించి పదిమందికీ తెలిసింది.





కమలానెహ్రూ కూడా కాంగ్రెస్ కార్యకలాపాలలో పాల్గొని జైలుపాలయింది. "నా భర్త అడుగుజాడలలో పయనించడానికి నేనెంతో ఆనందిస్తున్నాను; గర్వపడుతున్నాను. ప్రజలు ఈ పోరాటాన్ని తప్పక విజయవంతం చేయగలరని విశ్వసిస్తున్నాను," అన్నారామె.

మోతీలాల్ ఆరోగ్యం మరింత క్షీణించింది. నెహ్రూ, కమలానెహ్రూ విడుదల చేయబడ్డారు. పలువురు ప్రముఖులతో పాటు నెహ్రూ దంపతులు మోతీలాల్‌ను చూడడానికి వెళ్ళారు. అక్కడికి గాంధీజీ కూడా వచ్చారు.





"మహాత్మాజీ, నేను త్వరలోనే సెలవు తీసుకుంటాను. స్వరాజ్యాన్ని చూడ లేనేమో. అయితే మీరు మాత్రం తప్పక స్వరాజ్యం సాధిస్తారు. అది మీ వశమయి తీరుతుంది, నాకు తెలుసు!" అన్నాడు మోతీలాల్ గాంధీజీతో. గాంధీజీ ఆయన్ను ఆప్యాయంగా ఓదార్చాడు.

ఎం. ఏ. అన్సారీ, బిధాన్ చంద్రరాయ్, జీవ్‌రాజ్ మెహతా వంటి ప్రముఖ వైద్యులు (అందరూ సుప్రసిద్ధ నాయకులే) ఎంతో ప్రయత్నించినప్పటికీ— మోతీలాల్ నెహ్రూ, 1931వ సం॥ ఫిబ్రవరి 6వ తేదీన కాలధర్మం చెందాడు. మోతీలాల్ అంతిమ ఘడియలలో, ఆయన దగ్గర, నెహ్రూ, ఆయన తల్లీ ఉన్నారు.





అలహాబాదు సమీప గంగాతీరంలో మోతీలాల్ నెహ్రూ భౌతిక కాయానికి దహనక్రియలు జరిగాయి. "నదీతీరంలో చలికాలం సాయంకాలం వేళ, సన్నిహితులయిన మాకూ, లక్షలాదిమంది భారతీయులకూ ఎంతో ఆప్తులయిన ఆయన భౌతికకాయాన్ని అగ్నిజ్వాలలు దహించేశాయి," అని జవహర్‌లాల్ నెహ్రూ రాశాడు. —(ఇంకావుంది)



# న్యాయం కావాలి!

వీరప్పకు బాగా డబ్బున్నది. ఒక రోజున అతను దారిన పోతూంటే, దారి పక్కన నలుగురు పిల్లలు గోటీబిళ్ళ ఆడుతున్నారు. వాళ్ళలో ఒకడు కొట్టగా, కర్ర వచ్చి వీరప్పకు తగిలింది. వీరప్ప కోపంతో ఆ కుర్రవాడిమీదికి వెళ్ళాడు. వాడు దొరక్కుండా పారిపోయాడు.

"ఎవడ్రావాడు?" అని వీరప్ప మిగతా ముగ్గురు కుర్రవాళ్ళను అడిగాడు.

"వాడు బుట్టలల్లే వెంకప్ప కొడుకు," అని వాళ్ళలో ఒకడు బదులిచ్చాడు.

వీరప్ప ఇంటికి వెళ్ళి, వెంకప్పకు కబురు పంపాడు. వెంకప్ప రాగానే అతను, "నీ కొడుకు నన్ను కొట్టాడు. వాణ్ణి తీసుకురా," అన్నాడు.

"వాడు మిమ్మల్ని కావాలని కొట్టలేదు. ఆడుకుంటూంటే కర్ర జారి మీకు తగిలింది. అందుకు వాణ్ణి క్షమించండి. మళ్ళీ వాడివల్ల ఇలాంటి తప్పు జరగదు," అన్నాడు వెంకప్ప.

"వాడు నన్ను కొట్టాడు. నేనూ వాణ్ణి కొట్టడం న్యాయం. కబుర్లు కట్టిపెట్టి, వాణ్ణి నా దగ్గిరకు తీసుకురా," అన్నాడు వీరప్ప.

వెంకప్ప విసుగ్గా, "అసలు వాడు మిమ్మల్ని కొట్టాడని సాక్ష్యమేముంది? న్యాయం గురించి మాట్లాడుతున్నారు కాబట్టి, అన్నీ న్యాయాధికారికే చెప్పుకోండి," అని అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

డబ్బులేని వెంకప్ప, తననలా చులకన చేయడం, డబ్బున్న వీరప్పకు పట్టరాని కోపం తెప్పించింది. అతను వెంటనే న్యాయాధికారి వద్దకు బయల్దేరాడు. దారిలో శాంతప్ప అతడికి ఎదురుపడి, "ఎక్కడికి వీరప్పా, ఆవేశంగా వెళుతున్నావు?" అని అడిగాడు.

"వసుంధర"

వీరప్ప. శాంతప్పకు జరిగిందిచెప్పాడు. అంతా విన్న శాంతప్ప నవ్వి, ''తన కోపమే తన శత్రువన్నారు. ఒక చిన్న పిల్లవాడి వల్ల చిన్న తప్పు జరిగితే, నీకింత కోపమెందుకు? ఇంటికి వెళ్ళి తీరుబడిగా ఆలోచించు. నీ కోపం దానంతటదే తగ్గిపోతుంది,'' అన్నాడు.

ఇందుకు వీరప్ప మండిపడి, ''గొప్ప సలహాయే యిచ్చావు! నీలాంటివాళ్ళు మరి నలుగురుంటే, యీ ఊళ్ళో డబ్బున్నవాళ్ళకు గౌరవం లేకుండా పోతుంది,'' అన్నాడు.

''అయితేసరే, న్యాయాధికారి వద్దకే వెళ్ళు. ఆయన నీకు తగిన న్యాయం చేస్తాడు,'' అన్నాడు శాంతప్ప.

వీరప్ప న్యాయాధికారి వద్దకు వెళ్ళి జరిగింది చెప్పాడు. న్యాయాధికారి చిన్నగా నవ్వి, ''గోటితో పోయేదానికి, గొడ్డలి దాకా పోనిస్తున్నావు. చిన్న పిల్లాడితో నీకెందుకు? ఎవరైనా వింటే నవ్వుతారు!'' అన్నాడు.

''మీరు నీతులు చెబితే విందామని, నేను రాలేదు. న్యాయం జరిపిస్తారని వచ్చాను,'' అన్నాడు వీరప్ప.

''ఇలాంటి విషయాలు నాదాకా తీసుకు రాకూడదు. మన ఊళ్ళో శాంతప్ప వున్నాడుగదా! ఆయన సలహా తీసుకో,'' అన్నాడు న్యాయాధికారి.

''అతను నాకు న్యాయం చేయలేదు; నీతులే చెప్పాడు. నాక్కావలసింది న్యాయం!'' అన్నాడు వీరప్ప.



''సరే! నేను చెబితే శాంతప్ప నీకు న్యాయం చేస్తాడు. ఆయనవల్ల నీకు న్యాయం జరక్కపోతే, అప్పుడు నేను జరిపిస్తాను,'' అని న్యాయాధికారి, శాంతప్పకు కబురుపెట్టి రప్పించి, ''వీరప్ప న్యాయం కావాలంటే నీతులు చెప్పావుట. ఈయనకు న్యాయం జరిపించడం, నీకు చేతకాదా?'' అని ప్రశ్నించాడు.

''ఎందుకు చేతకాదు? వీరప్ప నాకు స్నేహితుడు. ఆయనకు దేనివల్ల మేలు జరుగుతుందో, నాకు తెలుసు. ఈ చిన్న విషయంలో న్యాయం కావాలంటూ మొండికెత్తితే, ఆయనకు అవమానం తప్పదు,'' అన్నాడు శాంతప్ప.

"చిన్నపిల్లవాడిమీద కత్తికట్టానని అనుకుంటే, నాకవమానమేం కాదు. న్యాయమే కావాలినాకు,'' అన్నాడు వీరప్ప.

''అయితే మళ్ళీ గోటీబిళ్ళఆట ఏర్పాటు చేయించండి. అప్పుడు వీరప్ప కర్రతో గురిచూసి దూరానపోయే వెంకప్ప కొడుకును కొట్టాలి. అదే న్యాయం!'' అన్నాడు శాంతప్ప.

దీనికి వీరప్ప సంతోషించి, ''అంతా బాగానే వున్నది. కానీ నేను కొట్టే సమయానికి వాడు పారిపోతే?'' అని అడిగాడు.

''పారిపోకుండా యిద్దరు వాణ్ణి పట్టుకుంటారు. అయితే నువ్వు కొట్టిన దెబ్బ వెంకప్ప కొడుక్కే తగలాలి. ఇంకెవ్వరికీ తగలకూడదు,'' అన్నాడు శాంతప్ప.



"అలా కుదరదు. వాణ్ణి కదలకుండా అక్కడే నిలబడమనడం న్యాయం," అన్నాడు వీరప్ప.

"ఏమో, అందుకు వెంకప్ప కొడుకు ఒప్పుకుంటేనే, అది న్యాయమవుతుంది. చిన్నపిల్లవాడు గనక భయం పుట్టి పారిపోతే ఏం చేయగలం?" అన్నాడు శాంతప్ప.

ఆ మర్నాడు గోటీబిళ్ళ ఆటకు ఏర్పాట్లు జరిగాయి. విచిత్రమైన యీ శిక్ష చూడడానికి ఊరిజనమంతా వచ్చారు. విశేషమేమంటే—మనుషులెవరూ తనను పట్టుకోకుండా, తను కదలకుండా ఉండడానికి, వెంకప్ప కొడుకు ఒప్పుకున్నాడు.

కన్నంలో గోటీబిళ్ళ వుంచి వీరప్ప కర్రతో కొట్టాడు. అది గురి తప్పింది. అలా మూడుసార్లు చేసినా వీరప్ప, వెంకప్ప కొడుకును కొట్టలేకపోయాడు.

"శిక్ష పూర్తయింది. అవకాశమిచ్చినా ప్రతీకారం చేయలేనివాడివని ఋజువయింది," అన్నాడు శాంతప్ప నవ్వుతూ.

అక్కడ చేరినవాళ్ళందరూ యిది విని, గొల్లుమంటూ నవ్వారు. అప్పుడు శాంతప్ప, వెంకప్పకొడుకును పిలిచి, "ఒరే, నువ్వు చాలా ధైర్యంగా కదలకుండా నిలబడ్డావు. నీ ధైర్యానికి మెచ్చుకుంటున్నాను. ఇంత ధైర్యవంతుడివి, ఆ రోజు వీరప్ప నీవెంట బడితే ఎందుకు పారిపోయావు?" అని అడిగాడు.

అందుకు వెంకప్పకొడుకు, "ఆ రోజు దొరికిపోతే, ఆయన నన్ను తప్పకకొట్టేవాడు. కానీ యీ రోజు సంగతి వేరు. చిన్నప్పుడు మా నాన్నా, వీరప్పగారూ గోటీబిళ్ళ ఆడుకునేవారట. వీరప్పగారికి గురి చూసి కొట్టడం చేతకాదని, నాన్న చెప్పాడు. అందుకే ధైర్యంగా నిలబడ్డాను," అన్నాడు వెంకప్ప కొడుకు.

ఇది విని అక్కడ చేరినవాళ్ళందరూ పెద్దగా నవ్వారు. వీరప్ప అవమానంతో తల వంచుకున్నాడు. ఆ తర్వాత చిన్న విషయాలకు న్యాయం కావాలంటూ, వీరప్ప మళ్ళీ ఏనాడూ రభస చెయ్యలేదు.





# కృష్ణావతారం

బాణుడి రథం వెయ్యి మూరల నిడివి గలది. దానికి వెయ్యి గుర్రాలు పూన్చి వున్నాయి. రథం ఎలుగుబంటి తోలు కప్పి ఉన్నది. దానికి ఒక ఎర్ర జెండా, నెమలి పతాకా ఉన్నాయి. ఆ రథంనిండా గదలూ, విల్లులూ, ఖడ్గాలూ, కత్తులూ పెట్టుకుని కుంభాండుణ్ణి సారథిగా చేసుకుని, బాణుడు అనిరుద్ధుడిపై యుద్ధానికి బయలుదేరాడు. అది చూసి అతని సేనాపతులందరూ ఉత్సాహం తెచ్చుకుని, తమ సేనలను బాణుడి రథానికి ముందూ, పక్కలా నడిపించుకుంటూ వచ్చారు.

అనిరుద్ధుడు తన పైకి వచ్చే బాణుణ్ణీ, అతని ఆయుధాలనూ, అతని చుట్టూ గల బలాలనూ చూసి ఏమాత్రం లక్ష్యపెట్టక, సూటిగా బాణుడి రథంకేసి ఎదురు రానారంభించాడు.

ఒక సామాన్య మానవుడు, అందులోనూ ఆయుధాలు విశేషంగా లేనివాడు, తనపైకి ధైర్యంగా వస్తూ ఉంటే బాణుడికి ఆశ్చర్యం కలిగింది. అతను తన రాక్షస సైనికులతో, "చూస్తారేం? ఆ దుర్మార్గుణ్ణి పట్టుకోండి! వెంటనే చంపిపారెయ్యండి!" అంటూ అనిరుద్ధుడిపై బాణవర్షం కురిపించాడు.

చేత ఒక్క కత్తి మాత్రమే గల అనిరుద్ధుడు ఆ బాణాలను ఏమాత్రం లక్ష్యపెట్టక తనకు అడ్డంగా వచ్చే రాక్షసులను తోసుకుంటూ వేగంగా బాణుడు

**26. బాణ అనిరుద్ధుల యుద్ధం**



విసిరే సరికి, అది బాణుడి గుండెలను చీల్చుకుని, వీపులో నుంచి బయటికి వచ్చి, భూమిలో దిగబడిపోయింది. బాణుడు ధ్వజస్తంభాన్ని పట్టుకుని కూలిపోయాడు.

కుంభాండుడు బాణుడికి స్పృహ వచ్చేటట్టు చేసి, "శత్రువు అసామాన్య ప్రతిభావంతుడు. ప్రపంచమంతా ఎత్తి వచ్చినా లక్ష్యపెట్టేటట్టు కనపడడు. అతడి సాహసమూ, ధైర్యమూ చూశావా? అతన్ని గెలవటం తేలిక కాదు. ముందు ముందు నీ ప్రాణాలూ, నా ప్రాణాలూ దక్కే ఉపాయం చూడకపోతే ఇతను రాక్షస కులానికే ఎసరు పెట్టేటట్టున్నాడు," అన్నాడు.

బాణుడు తన మంత్రితో, "గరుత్మంతుడు పామును పట్టినట్టుగా ఈ క్షణంలోనే ఈ మూఢుణ్ణి పట్టేస్తాను చూడు," అంటూ అదృశ్యుడైపోయి, తన కోసం దిక్కులు చూస్తున్న అనిరుద్ధుడి పైన కృష్ణసర్ప ముఖాలుగల బాణాలు వేసి, ఒక్క క్షణం అతని అవయవాలన్నీ బంధించి, అటూ ఇటూ ఏమాత్రం కదలకుండా చేశాడు. తరవాత అతను కుంభాండుడితో, "యౌవన గర్వితుడై ఈ దుర్మార్గుడు ఇప్పుడు మనకు చిక్కాడు. వీణ్ణి వెంటనే కత్తికి బలి

ఎక్కి ఉన్న రథాన్ని చేరుకున్నాడు. అది చూసి బాణుడి పరివారం నిర్ఘాంతపోయింది.

రథాన్ని సమీపిస్తూనే అనిరుద్ధుడు రథపు గుర్రాలను చంపసాగాడు. రక్తం ఏరులై పారింది. ఈ లోపల బాణుడు అనిరుద్ధుడిపై అనేక ఆయుధాలు విసిరాడు. అనిరుద్ధుడు చచ్చాడనుకుని రాక్షసులు పెడబొబ్బలు పెట్టారు. అయితే అనిరుద్ధుడు ముందుకు రాలేకపోవటం మాత్రమే జరిగింది.

ఇంతలో బాణుడు అనిరుద్ధుడి పైకి మహాశక్తిని విసిరాడు. అనిరుద్ధుడు దాన్ని చేత్తో పట్టుకుని, బలంకొద్దీ బాణుడిపైకే

చేద్దాం. లేకపోతే వీడు తెచ్చిపెట్టిన కళంకం మాయదు," అన్నాడు.

ఆ మాటకు కుంభాండుడు, "అది నిజమేగాని, ఒక్క విషయం గమనించాలి. ఇతను మన ఉషకు గాంధర్వ వివాహం ద్వారా ఇదివరకే భర్త అయి ఉన్నాడు. ఇతనికి ఏదన్నా జరిగితే అమ్మాయికి తీరని దుఃఖం కలిగి తీరుతుంది. అసలు ఇతను ఎక్కడి నుంచి వచ్చాడో, ఎవడో తెలుసుకోవలసిన అవసరం ఉన్నది. ఇతను మామూలు మనిషి మటుకు కాడు. ఇతని అందమూ, పరాక్రమమూ చూస్తే దేవతలను మించి ఉన్నాడు. ఇతను తప్పక చాలా గొప్పవాడే అయి ఉంటాడు. నీవంటి మహావీరుడితో ఎలా యుద్ధం చేస్తానా అన్న జంకు అతనిలో ఏమాత్రమైనా కనబడిందా? అసహాయుడైపోయి కూడా అతని ముఖాన క్రోధం ఎట్లా తాండవిస్తున్నదో చూడు! నీ కింతకన్న మంచి అల్లుడూ, అమ్మాయికి ఇంతకన్న మంచి భర్తా, నీ కింతకన్న మంచి ప్రత్యర్థీ దొరుకుతాడా! కాస్త ఆలోచించు," అన్నాడు.

కుంభాండుడి మాటలలో నిజం ఉన్నట్టే బాణుడికి తోచింది. బాణుడు, "అదీ నిజమే," అన్నట్టు తల ఆడించి,



అనిరుద్ధుడికి భటులను కావలి ఉంచి, తన ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.

అప్పుడు నారదుడు అనిరుద్ధుణ్ణి సమీపించి, ఊరడించి, "నేను ఇప్పుడే వెళ్ళి కృష్ణుణ్ణి తీసుకువస్తాను. అతని రాకతో నీ కష్టాలన్నీ విచ్చిపోతాయి. అంతదాకా ఈ వచ్చిన కష్టాన్ని ధైర్యంగా ఓర్చుకో," అని ధైర్యవచనాలు చెప్పి వెళ్ళిపోయాడు.

అనిరుద్ధుడు తల ఎత్తి చూసేసరికి, కన్నీరు కార్చుతూ ఉష కిటికీ వద్ద కనిపించింది. అతను ఆమెతో, "నీ తండ్రి నాతో ముఖాముఖి యుద్ధం చెయ్యలేక, మాయోపాయంతో నన్ను బంధించాడు.



అయినా విచారం లేదు. నా కష్టం తొలగించగలవాడు కృష్ణుడున్నాడు. తన సుదర్శన చక్రంతో ఎందరో రాక్షసులను నిర్మూలించినవాడు నాకు జరిగిన ఈ పరాభవాన్ని సహిస్తాడా? ఎందుకు దిగులుపడతావు? నీ తండ్రికి మంచి రోజులు చెల్లిపోయాయి,'' అని చెప్పాడు.

తరవాత అతను దుర్గను స్తోత్రం చేసి ధ్యానించసాగాడు. కొంతసేపటికి లోకేశ్వరి అయిన దుర్గ అతని ఎదట ప్రత్యక్షమై, అతన్ని బంధించిన బాణాల పంజరాన్ని చేత్తో తాకి భగ్నంచేసి, అతన్ని బంధవిముక్తుణ్ణి చేసి, ''త్వరలో నే కృష్ణుడు వచ్చి, బాణుడితో యుద్ధం చేసి ఓడించి, నిన్ను తీసుకుపోతాడు. నీకు శుభం చేకూరుతుంది,'' అని చెప్పి అంతర్థానమయిపోయింది.

ఈ లోపల ద్వారకలో చాలా గందరగోళం జరిగింది.

చిత్రరేఖ అనిరుద్ధుణ్ణి తీసుకుపోయాక అనిరుద్ధుడి భార్యలు స్పృహ తెలిసి, తమ భర్త జాడ తెలియక, పెద్దపెట్టున శోకాలు పెట్టసాగారు.

అనిరుద్ధుడి మందిరం నుంచి స్త్రీల ఆర్తనాదాలు వెలువడటం విని నగరంలోని యాదవ ప్రముఖులు తమ తమ ఇళ్ళలోనుంచి బయటికి వచ్చేసరికి, సభాభవనంలో భేరీ మోగింది. కృష్ణ బలరాములు మొదలుగా అందరూ సభలో చేరారు. అనిరుద్ధుడు కనిపించడం లేదని తెలిసి అందరూ విచారగ్రస్తులయారు. కృష్ణుడు సైతం కంట తడిపెట్టాడు.

అది చూసి వికద్రుడు కృష్ణుడితో, ''నీ చాటున యాదవ వంశం క్షేమంగా ఉన్నది. దేవేంద్రుడే తన క్షేమానికి నీ మీద ఆధారపడి ఉన్నాడు. అలాంటప్పుడు నువు కంట తడిపెడితే, అనిరుద్ధుడు కనపడకపోవడంకంటె కూడా అది పెద్ద విచారం అవుతుంది. అందుచేత నువు అందరికీ ఏదన్నా ధైర్యం చెప్పు,'' అన్నాడు.



దానికి కృష్ణుడు, "నా విచారం అని రుద్ధుడి జాడ తెలుసుకోలేకపోతే జనం నన్ను ఏమంటారోననే. చంటిపిల్లవాడుగా ఉండగానే ప్రద్యుమ్నుణ్ణి ఒక రాక్షసుడు ఎత్తుకుపోయాడు. ఆ రాక్షసుణ్ణి ప్రద్యుమ్నుడే చంపి తిరిగిరావడంతో నా పరువు కొంతవరకు దక్కింది. ఈసారి కూడా అలాగే అయినట్టు కనబడుతుంది. నా శత్రువు లెవరో నా మీద కసితో ఈ పని చేశారు. ఇది సాధారణ ఘటన మాత్రం కాదు. ఏదైనా మార్గం ఉంటే చెప్పండి. దాన్ని అనుసరించి నా శక్తికొద్దీ చెయ్యవలసినది చేస్తాను," అన్నాడు.

అప్పుడు సాత్యకి, వివిధ ప్రాంతాలకు మనుషులను పంపమని సూచించాడు.

ఉగ్రసేనుడు ఆ సూచనను బలపరిచి, రథాలమీదా, గుర్రాలమీదా, కాలినడకనా, అనేక మందిని అనేక ప్రాంతాలకు పోయి, అనిరుద్ధుణ్ణి వెతకమని ఉత్తరు విచ్చాడు.

అనాధృష్టి అనే సేనాపతి కృష్ణుడితో జంకుతూ జంకుతూ, "అయ్యా, నాకొక అనుమానం ఉన్నది. దేవతలు చాలా సార్లు నీవల్ల ఉపకారం పొందివున్న మాట నిజమేగాని, పారిజాతం తెచ్చినప్పుడు ఇంద్రుడు నీతో యుద్ధంచేసి ఓడిపోయాడు. ఆ అవమానం లోపల బాధిస్తూ ఉండవచ్చు. ఇంద్రుడే అనిరుద్ధుణ్ణి మాయంచేశాడా అని నా అనుమానం," అన్నాడు.

కృష్ణుడు ఈ మాటకు నవ్వి, "దేవతలు ఇలాంటి పని ఒక్కనాటికీ చెయ్యరు. తప్పకుండా ఇది రాక్షసులు చేసే పని. నావల్ల తమకు ఉపకారం ఉన్నదని తెలిసిన దేవతలు ఇలాంటి పని ఎప్పుడూ చెయ్యరు," అన్నాడు.

అక్రూరుడు కూడా కృష్ణుడి మాటను బలపరిచాడు.

"అనిరుద్ధుణ్ణి ఇలా దొంగిలించుకు పోవలసిన పని పురుషులకుండదు. ఎవతో పాపాత్మురాలైన స్త్రీయే ఈ పని



చేసి ఉండాలి. దైత్య, దానవ, దేవతా స్త్రీలకు ఎన్నో మాయలు తెలుసు. వాళ్ళు ఎక్కడికైనా పోగలరు, ఎవరినైనా భయపెట్టగలరు. కనక మనం ఆ జాడలను బట్టి వెతకాలి," అన్నాడు కృష్ణుడు.

కొన్ని రోజులయాక, అనిరుద్ధుణ్ణి వెతకబోయిన చారులు తిరిగివచ్చి, తమ ప్రయత్నం విఫలమయిందని చెప్పారు.

ఆ మర్నాడు ఉదయం కృష్ణుడు సభకు వచ్చాడు. ఉగ్రసేనుడు మొదలైన యాదవులందరూ సభతీరి ఉండగా అక్కడికి నారదుడు వచ్చాడు. అతిథి మర్యాదలన్నీ పూర్తి అయాక నారదుడు అందరికేసీ చూసి, "ఏమిటి మీరంతా పుట్టెడు విచారంలో మునిగి వున్నట్టున్నారు?" అన్నాడు.

"ఏం చెయ్యం? అనిరుద్ధుడు కనిపించడంలేదు. అతనికోసం అంతటా వెతికించాం. కాని ఫలితం లేకపోయింది," అన్నాడు కృష్ణుడు.

"అన్నట్టు, ఇన్ని యుద్ధాలు చూశాను గాని, మీ అనిరుద్ధుడు బాణుడితో చేసిన యుద్ధం ఉందే, అలాంటిది ఎక్కడా, ఎన్నడూ చూసి ఎరగను. అసలు ఏం జరిగిందంటే, ఆ బాణుడి కూతురు ఉష అనేది అనిరుద్ధుణ్ణి ప్రేమించి, చిత్రరేఖ అనేదాన్ని పంపింది. అది కాస్తా వచ్చి అనిరుద్ధుణ్ణి తీసుకుపోయి ఉషతో చేర్చింది. ఈ సంగతి బాణుడికి తెలిసి అనిరుద్ధుడితో యుద్ధానికి వచ్చి, చావు దెబ్బ తిని, మాయాయుద్ధానికి దిగి, సర్పబాణాలతో అనిరుద్ధుణ్ణి కాస్తా బంధించాడు. అందుచేత నువు వెళ్ళి ఆ బాణుడి అంతు తేల్చుకో. బాణుడుండే శోణపురం ఇక్కడికి చాలా దూరం. అందుచేత ఏ గరుత్మంతుడి సహాయంతోనే వెళ్ళు. ఈ మాట చెప్పటానికే వచ్చాను. సెలవు," అంటూ నారదుడు నిష్క్రమించాడు.

కృష్ణుడు గరుత్మంతుణ్ణి స్మరించాడు. గరుత్మంతుడు వచ్చాడు. వెంటనే

కృష్ణుడూ, బలరాముడూ, ప్రద్యుమ్నుడూ గరుత్మంతుడి మీద ఎక్కారు. వాళ్ళు శోణనగరం చేర వచ్చేసరికి వారి ముందు ఒక అద్భుతమైన వెలుగు కానవచ్చింది.

"కృష్ణా, ఈ వెలుగేమిటి?" అని బలరాముడు అడిగాడు.

"మనం ఇప్పుడు బాణుడి నగరాన్ని చేర వస్తున్నాం. శివుడు ఈ నగర రక్షణకు అగ్ను లందరినీ నియోగించాడు. మనకు ఇప్పుడు ఎదురైనది ఆహవనీయాగ్ని. దీని సంగతి గరుత్మంతుడు చూసుకుంటాడులే," అన్నాడు కృష్ణుడు.

కృష్ణుడలా అంటుండగానే గరుత్మంతుడు ఆకాశగంగ నుంచి జలం పుక్కిట పట్టి అగ్నిపై చల్లి, దాన్ని ఆర్పేశాడు. కృష్ణుడు గరుత్మంతుణ్ణి పొగడాడు.

గరుత్మంతుడు మరికొంత ముందుకు పోయేసరికి, శివుడు నియోగించిన మిగిలిన అగ్నులు పెద్దపెట్టున సింహనాదాలు చేశారు. వాటిని విని బాణుడు యుద్ధ సన్నాహాలు ప్రారంభించాడు.

ఈలోపల అంగిరసుడనే అగ్ని, జ్యోతిష్టోముడూ, విభాంగుడూ అనే అగ్నులను ఇరు పార్శ్వాలా పెట్టుకుని, మిగిలిన అగ్ను లన్నిటితోసహా కృష్ణుడితో యుద్ధం చేయ వచ్చాడు.

కృష్ణుడు అతనితో, "ఓ అంగిరసుడా, మునులు వేల్చిన ఆహుతులు మేక్కి, కొవ్వి నాపైకి యుద్ధానికి వస్తున్నావా? పో అవతలికి!" అన్నాడు.

అంగిరసుడు కోపించి, "దీనితో నీ ప్రాణం తీస్తాను," అంటూ ఒక శూలం కృష్ణుడి పైన విసిరాడు. కృష్ణుడు దాన్ని తన బాణంతో దారిలోనే విరిచి, మరొక బాణంతో అంగిరసుడి రొమ్ము ఛేదించేసరికి, అంగిరసుడు నెత్తురు ఓడుతూ రథంమీద మూర్ఛపోయాడు. ఆ దెబ్బతో అగ్ను లందరూ చెల్లాచెదురుగా పారిపోయారు.

వాళ్ళు అడ్డం తొలగగానే కృష్ణుడి కళ్ళ ఎదట శోణపురం స్పష్టంగా కనబడింది.





# భర్త ఎన్నిక

శిళ్ళంగేరి గ్రామంలో, సోమయ్య అనే ధనికుడుండేవాడు. ఆయనకు ఒకే ఒక కుమార్తె. ఆమె పేరు లక్ష్మీదేవి. మంచి రూపవంతురాలు. లక్ష్మీదేవికి పెళ్ళీడు రాగానే, సోమయ్య తగిన అల్లుడికోసం అన్వేషణ మొదలుపెట్టాడు. చాలామంది లక్ష్మీదేవిని వివాహమాడేందుకు ముందుకొచ్చారు. అయితే, సోమయ్యకూ, అతడి భార్యకూ, ఆస్తిపాస్తుల విషయంలో తమతో సరితూగగలవాళ్ళతో వియ్యమాడాలని వున్నది. లక్ష్మీదేవి మాత్రం మంచి విద్యావంతుణ్ణి చేసుకోవాలని కోరుకుంటున్నది.

శిళ్ళంగేరికి పక్క గ్రామమైన గంగాపురం జమీందారు కోటేశ్వరయ్యకు, ఒక్కడే కొడుకు. ఆయన స్వయంగా వచ్చి, లక్ష్మీదేవిని తనకుమారుడికివ్వవలసిందిగా సోమయ్యను కోరాడు. అదే విధంగా, పట్టణంలోని వజ్రాల వ్యాపారి బంగారయ్య, తన పెద్దకొడుక్కు లక్ష్మీదేవిని చేసుకుంటానంటూ కబురుపంపాడు.

శిళ్ళంగేరిలోనే ఒక పెద్ద పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న వేదమయ్యకు విద్యాధరుడనే కొడుకున్నాడు. అతడు బాగా చదువుకున్నవాడు. వ్యవసాయానికీ, వ్యాపారానికీ సంబంధించిన అనేక ముఖ్య గ్రంథాలను క్షుణ్ణంగా చదివాడు. లక్ష్మీదేవికి అతణ్ణి వివాహమాడాలని వున్నది. కాని, తల్లిదండ్రులు అందుకు అభ్యంతరం చెప్పారు.

"చూడమ్మా, లక్ష్మీ! విద్యాధరుడు ఒక్క విషయంలో తప్ప, మిగతావాటిల్లో మాకు నచ్చాడు. ఆ ఒక్క విషయం చాలా ముఖ్యమైనది. అతడికి ఆస్తంటూ ఏమీ లేదు కదా. కోటేశ్వరయ్య, బంగారయ్యల కొడుకులకు చెప్పుకోతగ్గ విద్యంటూ

కోలార్ కృష్ణ అయ్యర్



లేకపోతేనేం? కొన్ని తరాలపాటు, జీవనోపాధికి ఎలాంటి యిబ్బందులూ లేనంతటి ఆస్తిపరులు. బాగా ఆలోచించు,'' అని తల్లిదండ్రులు లక్ష్మికి చెప్పారు.

అందుకు లక్ష్మి, ''మీరన్నదీ నిజమే కావచ్చు! అయితే, మీరు నాదొక కోర్కె చెల్లించాలి. మీరు జమీందారు కొడుకునూ, వ్యాపారి కొడుకునూ, ఉపాధ్యాయుడి కొడుకునూ, మనింటికి ఆహ్వానించండి. తర్వాత వాళ్ళను వేరువేరుగా పిలిచి, ఈ ప్రశ్నలడగండి. వాళ్ళిచ్చే జవాబులనుబట్టి, నాకు తగిన వరుడెవరో, మీరే నిర్ణయించండి,'' అని, వాళ్ళనడగవలసిన ప్రశ్నలేమిటో, తండ్రికి చెప్పింది.

కుమార్తె కోరిన విధంగా సోమయ్య, ఆ ముగ్గురినీ ఆహ్వానించి, ముందుగా జమీందారు కొడుకును తానున్న గదిలోకి పిలిచి, కూతురూ, భార్యా సమక్షంలో అతణ్ణి ఇలా ప్రశ్నించాడు:

''బాబూ, నీకు నీ జమీందారీవ్యవహారాలన్నీ స్వయంగా చూసుకోవడానికి అవసరమైనంత విషయ పరిజ్ఞానం వున్నదా? లేక యీ విషయంలో నువ్వు, మరొకరిపైన ఆధారపడవలసి వుంటుందా?''

ఇందుకు జమీందారు కొడుకు, ''అవన్నీ తెలుసుకోవలసిన అవసరం, నాకు లేదు. ఇందుగ్గాను మాకు గుమాస్తాలూ, నౌకర్లూ వున్నారు,'' అన్నాడు.

''నీకు, వేదమయ్య కుమారుడు విద్యాధరుడు తెలుసుగదా; అతనికి అనేక విషయాలు క్షుణ్ణంగా తెలుసు. లక్ష్మి నిన్ను పెళ్ళాడితే, ఆ కుర్రవాడు ఎన్నో గ్రంథాలు చదివి నేర్చిన పాండిత్యాన్ని, నువ్వూ నేర్వగలవా?'' అని అడిగాడు సోమయ్య.

''అదేలా సాధ్యమవుతుంది?'' అంటూ ఆశ్చర్యపోయాడు జమీందారు కొడుకు.

తర్వాత సోమయ్య, వ్యాపారి బంగారయ్య కొడుకును పిలిచి, జమీందారు కొడుకును అడిగిన ప్రశ్నలే అడిగాడు. అతడూ, జమీందారు కొడుకు యిచ్చిన జవాబుల్లాంటివే యిచ్చాడు.

సోమయ్య, వేదమయ్య కొడుకు విద్యాధరుణ్ణి పిలిచి, "నీకు జమీందారు కోటేశ్వరయ్య, వ్యాపారి బంగారయ్యలు తెలుసు గదా. మా అమ్మాయి, నిన్ను పెళ్ళాడితే, వాళ్ళకు సాటిగా ఆస్తి పాస్తులను సంపాదించుకోగలవా?" అని ప్రశ్నించాడు.

విద్యాధరుడు నవ్వి, "వాళ్ళ ఆస్తికి సమానమైన ఆస్తిని, త్వరలోనే సంపాదించగలను," అన్నాడు.

ఆ జవాబుకు సోమయ్య ఆశ్చర్యపోయి, "అదెలా సాధ్యం?" అని అడిగాడు.

"ఆస్తీ, పలుకుబడీ లాంటి వాటిల్లో, మీరు జమీందారుకూ, బంగారయ్యకూ సమానులు, అవునా? మీకు కాబోయే అల్లుడు, వాళ్ళంత ధనవంతుడై వుండాలి. లక్ష్మీదేవి, మీ ఏకైక సంతానం. ఆమెను పెళ్ళాడిన క్షణం నుంచీ, నేను కూడా మీ ఆస్తికంతకూ వారసుణ్ణవుతాను. ఆ విధంగా, ధన విషయంలో, పలుకుబడి విషయంలో నేను, ఆ జమీందారుకూ, వర్తకుడికీ తీసిపోను!" అన్నాడు విద్యాధరుడు.

ఈ జవాబు సోమయ్యకు కొంత తృప్తి కలిగించడంతో, చిన్నగా నవ్వి కూతురు కేసి చూశాడు. విద్యాధరుడు గదిలోంచి బయటికిపోగానే, లక్ష్మీదేవి తల్లిదండ్రులతో, "విద్యాధరుడు చెప్పింది, మీకు అర్థమైంది కదా? నన్ను పెళ్ళాడాక ఆస్తి విషయంలో విద్యాధరుడు, జమీందారు కొడుక్కూ, బంగారయ్య కొడుక్కూ ఏమాత్రం తీసిపోడు. పైగా వాళ్ళకు లేని విద్య ఈయనకున్నది. అందువలన, ఇతరులపై ఆధారపడకుండా, ఉన్న ఆస్తిని పెంపొందించగలడు. నన్ను వివాహమాడినా వాళ్ళకు, విద్యాధరుడికున్న విద్య లభించదు. ఇప్పుడు చెప్పండి, మీ నిర్ణయమేమిటో?" అన్నది.

"నువ్వు చెప్పినదంతా నిజం! నీవు కోరినట్టు, విద్యాధరుడితో నీ వివాహం మా కిష్టమే," అన్నారు తల్లిదండ్రులు.

తర్వాత ఒక శుభముహూర్తాన లక్ష్మీదేవి వివాహం, విద్యాధరుడితో అతి వైభవంగా జరిగిపోయింది.





# మర్రిచెట్టు సాక్ష్యం

ఒక ఊళ్ళో నారాయణశెట్టి అని ఒక ధనికుడుండేవాడు. ఆయన ఒకనాడు దూరగ్రామం పోతూండగా దారిలో కోటయ్య అనే గ్రామస్థుడు ఎదురుపడి, "బాబూ, శెట్టిగారూ, ఇల్లంతా కూలిపోయింది. తొలకరి లోపుగా బాగు చేయించుకోకపోతే నేనూ, పిల్లలూ ఏ చెట్టుకిందైనా నిలబడాలిసిందే. రెండువందల రూపాయలిప్పించారా, ధాన్యం, అమ్మగానే మీ బాకీ తీర్చేస్తాను," అని దీనంగా ప్రాధేయపడ్డాడు.

నారాయణశెట్టి చాలా మెత్తని మనిషి. కోటయ్య మాట తీసెయ్యలేక, అప్పటికప్పుడే తన దగ్గిర ఉన్న సొమ్ములో నుంచి రెండువందలు తీసి ఇచ్చాడు.

కోటయ్య అనుకున్న ప్రకారం ఆ బాకీ తీర్చలేదు. అప్పటికే ఒక పంట చెల్లిపోయింది. అయినా, నారాయణశెట్టి బాకీ అడగలేదు. ఇంకో పంట కూడా ఇంటికి వచ్చేసింది.

ఒకనాడు శెట్టి కోటయ్యను రమ్మని పిలిపించి, మంచిగా, "ఏం కోటయ్యా, ఆ బాకీ చెల్లు వెయ్యకనేపోతివి. ఏడాది వెళ్ళి రెండో ఏడు కూడా జరుగుతున్నది గదా!" అన్నాడు.

"బాకీ ఏమిటి?" అన్నాడు కోటయ్య ఆశ్చర్యంగా.

"ఇల్లు బాగుచేయించుకుంటానని ఆ యేడు వేసవిలో దారిలో కనబడి రెండు వందలు పుచ్చుకుంటివే. జ్ఞాపకం లేనట్టు మాట్లాడతావేం?" అన్నాడు శెట్టి.

"నేనొకవేళ మరిచిపోయినా, మీ దగ్గిర పత్రం ఉంటుందిగా. అది పంపించండి చెల్లు వేస్తాను," అన్నాడు కోటయ్య. తాను పత్రం రాసి ఇవ్వనిమాట తెలిసి ఉండే.

"నువు నాకు పత్రమైనా రాయలేదే. ఇవాళో రేపో చెల్లువేస్తావుగదా, ఈ భాగ్యానికి పత్రం దేనికి లెమ్మని నేను నిన్ను అడగనూ లేదు," అన్నాడు శెట్టి ఎంతో ఆశ్చర్యంగా.

"ఇది చాలా బాగుందండోయ్! మీరెంత సంపన్నులైతే మాత్రం అమాయకుడు కదా అని నాకు లేని బాకీలు అంటగడతారా?" అన్నాడు కోటయ్య గొంతెత్తి అఘాయిత్యంగా.

అక్కడ నలుగురూ పోగయారు. ఏమిటంటే ఏమిటని శెట్టినీ, కోటయ్యనూ అడిగారు.

శెట్టి జరిగిన సంగతి జరిగినట్టుగా చెప్పాడు.

అన్నీ అబద్ధాలన్నాడు కోటయ్య.

"ఇదేదో మునసబుగారు తేల్చాల్సిందే. అక్కడికి పదండి," అన్నారు ఊళ్ళోవాళ్ళు.

"మునసబుగారితోనైతేమాత్రమేం? ఉన్నమాట చెప్పటానికి నాకేం భయం?" అంటూ కోటయ్య తిన్నగా ముందుకు నడిచాడు.

మునసబు చాలా తెలివిగలవాడు, ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగలడు. ఆయన శెట్టి చెప్పినదంతా విన్నాడు. కోటయ్య చెప్పినదీ విన్నాడు.



"నేనేం బిచ్చగాణ్ణా? రెండువందలు అప్పుచెయ్యవలసిన కర్మ నాకేం? నా పొలంలో వచ్చే గింజలమ్ముకుని ఇల్లు బాగుచేయించుకున్న మాట నిజమే. శెట్టిగారు నాకు నిజంగా అప్పే ఇస్తే రెండేళ్ళు పత్రం సాక్ష్యం లేకుండా ఊరుకుంటారా?" అన్నాడు కోటయ్య.

మునసబు శెట్టికేసి తిరిగి, "ఏమండీ, మీరు కోటయ్యకు డబ్బు ఎక్కడ ఇచ్చారు? డబ్బిస్తుండగా ఎవరూ చూడలేదా?" అని అడిగాడు.

"అక్కడ ఎవరున్నారు, బాబూ? ఒక మర్రిచెట్టు కింద కూచుని డబ్బు తీసి ఇచ్చాను," అన్నాడు శెట్టి.

''ఇకనేం? ఆ మర్రిచెట్టును సాక్ష్యం వేసుకుందాం. మీరు ఇప్పుడే వెళ్ళి ఆ మర్రిచెట్టుతో నేను రమ్మంటున్నానని చెప్పి రండి,'' అన్నాడు మునసబు శెట్టితో, గంభీరంగా.

శెట్టి, ''మర్రిచెట్టు వచ్చి సాక్ష్యం చెబుతుందాండి?'' అన్నాడు కాస్త సంకోచంగా.

''నేను రమ్మంటే రాకేం జేస్తుంది? మారు మాట్లాడకుండా వెళ్ళి త్వరగా చెప్పి రావయ్యా! ఆ మాట కాస్త మర్రి చెట్టుకు చెప్పి నీ దారిన నువు వచ్చెయ్యి. మేమంతా నీకోసం ఇక్కడే వేచి ఉంటాం త్వరగా వెళ్ళిరా,'' అన్నాడు మునసబు.

అక్కడ చేరినవారంతా మునసబు మాటలకు తెల్లబోయారు. ఇక కోటయ్య ఆనందానికి అంతే లేదు. మునసబుకు మతి పోయిందనీ, తన బాకీ రుజువు కావటం కల్ల అనీ అతను లోలోపల ఎంతగానో సంతోషించ సాగాడు.

కొద్దిసేపు గడవనిచ్చి మునసబు తొందరలో ఉన్నవాడల్లే, ''ఏం కోటయ్యా? శెట్టి ఈపాటికి అక్కడికి చేరి ఉంటాడంటావా?'' అని అడిగాడు.

''అబ్బే! అప్పుడేనాండీ? అది కోసున్నర దూరంలో ఉంది. అదీగాక వాన కురిసింది గదా, ఆ చెరువుగట్టు దారి చెప్పరానంత బురద! అయినా అక్కడ ఉండే మర్రి చెట్లలో అసలుదాన్ని పోల్చటమే ఎంతో కష్టమవుతుంది,'' అన్నాడు కోటయ్య నవ్వుతూ.

మునసబు చేతికర్రతో కోటయ్య వీపు మీద ఠపీమని కొట్టి, ''దొంగవెధవా! శెట్టి నీకు ఏ చెట్టుకింద డబ్బిచ్చాడో కూడా తెలుసునన్నమాట!'' అన్నాడు.

మునసబు యుక్తికి అందరూ ముగ్ధులయ్యారు. కోటయ్య బాకీ ఒప్పుకుని శెట్టికి వడ్డీతో సహా సొమ్ము చెల్లించుకున్నాడు. సొమ్ముపోగా, ఆనాటి నుంచి కోటయ్యకు ఊళ్ళో తల ఎత్తుకు తిరగటానికి లేకుండా పోయింది.



# మాటకారితనం

రామాపురం గ్రామంలో, పాపయ్య అనే ఒక మాటకారి ఉండేవాడు. ఒకసారి గ్రామస్థులంతా దేవాలయ నిర్మాణానికి విరాళాలు సేకరించేందుకు, పాపయ్యను నియమించారు.

ఆ ఊళ్ళో రామయ్య, లక్ష్మయ్య అనే యిద్దరు పెద్ద వ్యాపారస్థులుండేవాళ్ళు. వాళ్ళు కవలలు కావడం చేత, ఎవరు రామయ్యో, ఎవరు లక్ష్మయ్యో గుర్తించడం కష్టంగా వుండేది.

పాపయ్య మొదట లక్ష్మయ్య ఇంటికి వెళ్ళాడు. లక్ష్మయ్య, అతడితో, "ముందుగా మీరు, మా అన్న రామయ్యగారి దగ్గిరకు వెళ్ళివుండాల్సింది," అన్నాడు.

"గుణానికి అన్నేమిటి, తమ్ముడేమిటి? దానగుణంలో, యీ ఊళ్ళో మీకెవరూ సాటి రారు. విరాళాలిచ్చేవారి పేర్లలో, మొదట మీ పేరుంటేనే బావుంటుంది," అన్నాడు పాపయ్య.

లక్ష్మయ్య నూటపదహారు వరహాలిచ్చి పంపాడు.

మర్నాడు పాపయ్య, రామయ్య ఇంటికి వెళ్ళి, "పెద్దవారు మీరు. ముందుగా నేను, మీ ఇంటికి రావలసింది. పొరబాటున మీ తమ్ముడిగారింటికి వెళ్ళాను. ఎంత! నూటపదహారిచ్చి, చాలా అని అడిగాడు. ఎంతయినా అన్న అన్నే, తమ్ముడు తమ్ముడే. దేవాలయ నిర్మాణానికి, మీ హోదాకు తగ్గట్టు విరాళం రాయండి," అన్నాడు.

"మీరు మంచి మాటకారి అన్న సంగతి అందరికీ తెలుసు కాని, మీరనుకున్నట్టు నేను రామయ్యను కాదు, లక్ష్మయ్యను. మా అన్నగారు లోపల స్నానం చేస్తున్నారు. వచ్చాక పొగుడుదురుగాని అలా కూర్చోండి!" అన్నాడు నవ్వుతూ లక్ష్మయ్య.

తన మాటకారితనం అందరి దగ్గిరా, అన్నివేళల్లో పని చేయదని తెలుసుకున్నాడు పాపయ్య! పాపం!

—బి. రఘురామరాజు





# బంగారు పంట

జావాద్వీపంలో డోంగో అనే పేద కుర్రవాడు ఉండేవాడు. వాడు బొత్తిగా దిక్కులేనివాడు. వాడు ఒక వితంతువు వద్ద కమతం చేస్తూ, ఆమె పొలంలో పని చేసేవాడు. వాడు చేసే పొలం చాలా సారవంతమైనది. అయినప్పటికీ డోంగో సాగుచేసిన ఏడు ధాన్యమంతా తప్పవేసి పోయింది. పైరు ఏపుగా పెరిగింది. కంకులు కూడా బాగా వేశాయి. కాని నూర్చితే అంతా తాలుకిందనే పోయింది. ఒక్క గింజ రాలలేదు.

మొదటి ఏడు అయినట్టే రెండో ఏడు కూడా జరిగేసరికి, గ్రామంలో వాళ్ళు గుసగుసలు ప్రారంభించారు. ఆ వితంతువు పిసినిగొట్టు అనీ, ఆమె గ్రామదేవతకు కూడా సరిగా నైవేద్యం పెట్టదనీ, అందుకే పంట నాశన మవుతున్నదనీ వాళ్ళు చెప్పుకోవటం విని, ఆమెకు కోపం వచ్చి, డోంగోను పనిలో నుంచి వెళ్ళగొట్టింది. వెళ్ళేటప్పుడామె వాడి చేత చిల్లిగవ్వ కూడా పెట్టలేదు.

డోంగో ఆకలితో అలమటిస్తూ ఆ గ్రామం విడిచి బయలుదేరాడు. ఒకనాటి సాయంకాలం అతను మరొక గ్రామం చేరి ఊరి బయట ఉన్న ఒక ఇంటి తలుపు తట్టాడు. ఆ ఇంట్లో వున్న వితంతువు వచ్చి తలుపు తెరిచింది. తలుపును ఆనుకుని ఉన్న డోంగో కుప్పకూలిపోయి, హీనస్వరంతో, "ఒక్క ముద్ద పెట్టండి. ప్రాణం పోతున్నది," అన్నాడు.

ఆ వితంతువు వెంటనే ఆ కుర్రవాణ్ణి లోపలికి నడిపించుకుపోయి, అన్నం పెట్టి, "కన్నా, కాలూ ఉన్నవాడివి గదా! నీకు ముష్టి ఎత్తుకునే గతి ఎందుకు పట్టింది? ఏదైనా పని చేసుకోవచ్చునే!" అన్నది.

జావా జానపద కథ

డోంగో తన కథంతా చెప్పి, ''కష్టపడి పనిచేశాను. మరొకడైనా అంతకన్న చెయ్య లేడు. కంకుల్లో గింజ పండకపోతే అది నా తప్పా? పొలంగలావిడ చేసుకున్న పుణ్యం ఎటువంటిదో!'' అన్నాడు.

''నీ తప్పేమీ లేదు మరి. నువు పొలం పని చేస్తానంటే మాకు కాస్త పొలం ఉన్నది. అందులో పని చెయ్యి. రాబడిలో అయిదోవంతు నువు తీసుకో. మాకు దున్నలు లేవు. అయితే పొలం చాలా చిన్నది,'' అన్నదా వితంతువు.

''ఫరవాలేదు. నా శక్తికొద్దీ పని చేస్తాను,'' అన్నాడు డోంగో.

మర్నాడు ఉదయమే అతను పార తీసుకుని పొలానికి వెళ్ళాడు. పారతోనే పొలమంతా తవ్వి, నాగలితో దున్నినంత బాగా తయారుచేశాడు. తరుణంలో నాట్లు తానే వేశాడు. పైరు ఎదిగి వచ్చింది. చక్కని కంకులు వేసి, బంగారం రంగుకు తిరిగాయి.

కోతల తరుణం సమీపిస్తూండగా డోంగోకు మిన్ను విరిగి మీదపడినట్టయింది. అతను ఒకనాడు కంకులను నొక్కి చూస్తే అన్నీ తప్ప గింజలే! వాటిలో బియ్యపు గింజలు లేవు.

''ఇదంతా నా దురదృష్టమే కావాలి. నన్ను పనికి పెట్టుకున్నవాళ్ళ గతి ఇంతే కాబోలు,'' అనుకుని డోంగో హతాశుడై పోయాడు. జరిగిన సంగతి తన యజమానురాలికి చెప్పే ధైర్యం అతనికి లేక



పోయింది. కోతలు కోశాక ఆవిడకు అసలు సంగతి తెలియనే తెలుస్తుంది అని ఊరుకున్నాడు.

మర్నాడు కోతలనగా డోంగో పారిపోవటానికి నిశ్చయించుకున్నాడు. అతను తెల్లవారక ముందే లేచి, చప్పుడు చెయ్యకుండా ఇంటి నుంచి బయలుదేరాడు. తాను శ్రమపడి పెంచిన పైరును మరొక్కసారి చూసుకుని మరీ వెళ్ళిపోవాలనిపించింది. పొలాన్ని చేరుకుని ఒక కంకి కోసి వడ్లగింజలను నలిచాడు. లోపల బియ్యపుగింజలు లేవు కాని, లోపల సన్నని బంగారపు గింజలాటిది ఉన్నది.

డోంగో తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఎన్ని వడ్లగింజలు నలిస్తే అన్నిటిలోనూ బంగారపు గింజలున్నాయి. అవి నిజంగా బంగారపు గింజలే!

అతను అమితోత్సాహంతో పరిగెత్తుకుంటూ ఇంటికి తిరిగి వెళ్ళి, తన యజమానురాలికి బంగారు గింజలు చూపించబోయాడు.

"ఏమిట్రా అదీ? అంత ఉత్సాహంగా వున్నావు!" అన్నదామె.

"మన పొలంలో బంగారం పండిందమ్మా! ఇదుగో బంగారం!" అంటూ అతను ఆమెకు బంగారం గింజలు చూపాడు పట్టరాని ఆనందంతో.

అందులో అబద్ధం ఏమీ లేదు. చేను కోసి కంకులు వలిస్తే, ఇంత పెద్ద బంగారు గింజల రాసి పడింది. యజమానురాలు వాడికి అందులో అయిదో వంతు ఇచ్చి, తాను అన్న మాట నిలబెట్టుకున్నది. ఆమె గ్రామంలో వారందరినీ పిలిచి పెద్ద విందు చేసింది.

డోంగో తన వంతుతో పొలాలు కొన్నాడు. తన యజమానురాలు కొన్న పొలాల సాగూ, తన పొలాల సాగూ కూడా అతనే చూశాడు. ఆ పొలాలలో పనిచేసిన వారందరికీ ఫలసాయంలో అయిదోవంతు ఇస్తూ వచ్చాడు. అది మొదలు జావాలో పొలం పనివారికి పంటలో అయిదో వంతు ఇవ్వటం ఆనవాయితీ అయింది.




పసిఫిక్, అట్లాంటిక్
మహాసముద్రాలలో నివసించే సాల్మన్
చేపలు మంచినీటి ప్రవాహాలలో గుడ్లు పొదిగి
పిగులుతాయి. కాని ఎక్కువకాలం ఇవి సముద్ర
జలాలలోనే నివసిస్తాయి. అయితే, గుడ్లు పెట్టడానికి
మాత్రం అవి మళ్ళీ అనేక అవరోధాలూ, అడ్డంకులూ
దాటుకుని వందలాది మైళ్ళు ప్రయాణం చేసి
మంచినీటి జలప్రవాహాలను చేరుకుంటాయి!
సాల్మన్ చేపలు


ఊసరవెల్లి!
అన్ని పరిసరాలకూ తగిన విధంగా రంగులు
మార్చే స్వభావంకలది ఊసరవెల్లి అని అందరూ
అనుకుంటారు. అయితే, ఇది నిజం కాదు. ఎందుకంటే
అది కొన్ని పరిసరాలకు అనుగుణంగా మాత్రమే—ఊదా, ఆకుపచ్చ రంగులలోనే
రంగు మార్చగలదు. దాని చర్మంలోని కణాల రంగుమారడంవల్ల ఇది సాధ్యమవుతుంది!


అతి ప్రాచీన సజీవ వృక్షం!
ప్రపంచంలోకెల్లా అతి ప్రాచీనమైన సజీవ
వృక్షం కాలిఫోర్నియాలోని శ్వేతపర్వతా
లలో ఉన్నది. బ్రిసిల్‌కోన్‌పైన్ అని చెప్ప
బడే ఈ ఒకరకం దేవదారు వృక్షం వయసు
4,600 సం॥ వుంటుందంటున్నారు!

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇల్లాలికి ఇల్లే!

రెండవ ఫోటో : ఇలలో దేవాలయం !!

పంపినవారు : గుమ్మళ్ల విఠల్, మచిలీపట్నం, (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 36-00.

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి :

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

CHANDAMAMA (Telugu) October 1989 Regd. No. M. 4854

